# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ప్రథమ భాగము





గ్రంథకర్త:
పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద
యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు, బి.ఏ, బి.ఎల్.
నర్సాపురం, (ప॥ గో॥ జిల్లా)

# గురుస్తోత్రము

శ్లో॥ గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు, ర్గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః

శ్లో॥ వందే సద్గురునాయకం, సురనుతం, వందే దయావార్నిధిం
వందే శుభ్రమనోజ్ఞహాసవదనం వందే త్రిమూర్త్యాత్మకం
వందే సర్వదిగంత విశ్రుతయశో వర్ధిష్ణు శాంతిప్రదం
వందే నిశ్చలపూర్ణబోధ ఫలదం, వందే ప్రమోదోజ్వలం

శ్లో॥ పౌన్నాల వంశ కలశాంబుధి కైరవాప్తం
పూర్ణం దయానిధి మనంత గుణైకధిష్ణ్యం
రాజాధిరాజ మకుటాంచిత రత్నసేవ్యం
శ్రీ రాజయోగి గురుమంతరతో నమామి

శ్లో॥ అజ్ఞానతి మిరాంధస్య, జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన, తస్మై శ్రీ గురవేనమః

శ్లో॥ యస్య ప్రసాదాదహమేవ సర్వం
మయ్యేవ సర్వం పరికల్పితంచ
యిత్థం విజానామి సదాత్మరూపం
తస్యాంఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యం ॥

శ్లో॥ సంసార సాగర సముద్ధరణైక మంత్రం
బ్రహ్మాది దేవముని పూజిత సిద్ధమంత్రం
దారిద్ర్య దుఃఖభవరోగ వినాశమంత్రం
వందే మహాభయహరం గురురాజమంత్రం

శ్రీ సద్గురుప్రభు మహారాజకీ జై !!

# కృతి సమర్పణము

## పద్య కుసుమాంజలి – తృతీయ పుష్పం

శ్రీకార ఓంకార చిర శుభాకార!
సర్వమంగళ నామ సర్వ స్వరూప!
పొన్నాల వంశాబ్ధి పూర్ణ శశాంక!
శ్రీ రాజయోగీంద్ర శ్రిత పారిజాత!

ఈ పుణ్య దివసాన నీ పూజచేసి
సర్వార్పణంబుగా శరణంచు మ్రొక్కి—
గంధంబు పోనట్టి కసిగందనట్టి
అర్థ సౌగంధ సంవాసితంబైన
అక్షయంబగు సువర్ణాక్షర గ్రథిత
మీ దివ్యహారంబు నిత్తు గైకొమ్ము
కంఠసీమకు నలంకరణంబుగాగ
కరుణాంతరంగ సద్గురు సార్వభౌమ!

బాద్ :
...73 :

గ్రంథకర్త.

## శ్రీ మదచలఋషి శ్రీమద్రామడుగు శివరామ దీక్షిత
## గురుపీఠ రాజయోగాశ్రమాద్యక్షులు



1. శ్రీమదచలఋషి దయానంద పౌన్నాల రాజయోగీంద్రులవారు
2. వీరి సతీమణి మాతృశ్రీ అనసూయాంబగారు

శ్రీ గురుభ్యోనమః

# పీఠిక

శ్రీ పండితారాధ్య, పండిత శివానందస్వామి, శ్రీశివ రామ దీక్షిత గురుపీఠ సంప్రదాయకులైన పండితోత్తములు. వీరు తమ శాస్త్ర పాండిత్యమును, గురుకృపచే సిద్ధించిన ఆరూఢతకు జతచేసి, పరిపూర్ణ బోధ సిద్ధాంత శిరోమణి, అచలబోధ శిఖామణి అను గ్రంథములను, పరిపూర్ణ బోధ పరంగా కొన్ని యుపనిషత్తులను రచించిరి. వీరి గురుపరంపర: శ్రీ శివరామ దీక్షితులవారి శిష్యులు రామలింగాచార్యులు, వీరి శిష్యులు, మల్లేశ దేశికులు, వీరి శిష్యులు పండితశివానంద శ్రీ శివరామ దీక్షితులు దక్క, మిగిలిన వారందరూ, ఆదిలో శైవమతస్థులైయిందురనుటకు వీరి పేర్లున్ను శివానందులవారి రచనలున్ను ఆధారముగానున్నవి.

వీరి గ్రంథము లీశతాబ్దములో ముద్రిత అయినవి. వీరి రచనలలో దృష్టాంతములేని వాక్యముండుట అరుదు. మెరుక నిరూపణ, నిరసనలు చేయుపట్ల వీరి దృష్టాంతము లెంతయో తోడ్పడును దృష్టాంతము లేనిచో యెంతటి సిద్ధాంత వాక్యములైనను అంగీకారము కాజాలవని వీరెరిగి యుండుటే ఇందుకు కారణమనదగును. పరిపూర్ణ పరబ్రహ్మము, పాటిలేని కేవల నిరపేక్షకమైనదగుటచే దానికి దృష్టాంతము లుండజాలవు.

శ్రీ పండిత శివానందస్వామి రచించిన పై రెండు గ్రంథములలోని ముఖ్యప్రకరణములు మూలముగా గైకొని అవసరమైన మార్పులతో, గురుశిష్య సంవాద రూపంలో "కం॥ మోదమున ప్రొద్దుపోకకు వాది ప్రతివాదులగుచు వర గురుశిష్యుల్ వాదించిరనుచు నొక సంవాదము" కల్పించి "పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం" అను యీ గ్రంథము ప్రథమభాగం ప్రకటిస్తున్నాము. మేము చేసిన మార్పులువానికి కారణములు యీదిగువ తెలియజేస్తున్నాము.

1) మూలగ్రంథములో ముద్రణాస్ఖాలిత్యములు మెండు విరామస్థానములు పాటింపబడలేదు. గురుశిష్య సంవాదములో నుండిన విషయము సుబోధకము కాగలదు.

2) ప్రకరణ శీర్షికలు, ప్రకరణ విషయములకు తగిన ట్లుగా మార్పు చేయబడినవి.

3) ఎరుక నిర్ణయముగానిచో పరిపూర్ణబోధ దుర్గవ గాహకమే, కనుక ముందు ఎరుక నిర్ణయ ప్రకరణములు కూర్చబడెను. "మొదలచలము నెరిగించెద" నని శ్రీ కృష్ణ దేశికేంద్రులవారి ప్రతిజ్ఞ ఎరుక యొక్క స్థాన స్వరూప స్వభావము లెరింగిన యుత్తమాధికారుల విషయంలో మాత్రమే వర్తించును. కనుక ప్రకరణముల క్రమము మార్చుట జరిగినది.

4) శ్రీ శివానంద తమ భావములను శ్లోకరూపంలో వ్రాసినారు. మరిన్ని "లింగ, శివ, పరశివ, పరమశివ, పరమ

ప్రభు, పరశివతత్వ" మాదిగా శబ్దములచే పరిపూర్ణ బ్రహ్మ మును సూచించుచుండిరి. మరియు శైవమత సంబంధముగు ప్రభులింగలీల" వాక్యములను ప్రమాణములుగ నిచ్చుచుండిరి పరిపూర్ణభావము కూడ నొక శైవమత శాఖయేమోననే అపోహ కలుగకుండుటకు, వారి శ్లోకములను, అట్టి ప్రభులింగ లీలలోని వాక్యములను, అట్టి శబ్దములను తొలగించుట జరిగి నది. శ్రీ శివరామ దీక్షిత నిజగురు సాంప్రదాయమును వున్నదున్నట్లుగా పరిశుద్ధముగానుంచుటకై పీఠగ్రంధముగా యిది ఆచంద్రార్కము వర్ధిల్లవలెననీ, కొన్ని మార్పులు చేర్పులు చేయుట అవసరమయ్యెను

5) సంప్రదాయిక పెద్దలందరూ, సన్యాసాశ్రమ నిర సన గావించి గృహస్థాశ్రమమునే శ్లాఘించిన వారగుటచేతను, అన్నమయ, ప్రాణమయ, మనోమయ; విజ్ఞానమయ పురుష యోగముల నాల్గింటికన్ననూ, పరిపూర్ణ రాజయోగమే మిన్నయగుటచేతను యీ గ్రంధమునకు పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణమను నామముంచుట జరిగినది,

6) ఈ ప్రకరణములు పూర్వనామములతోనే మా "రాజయోగి" వేదాంత మాస పత్రికయందు ప్రకటించి యున్నాము ఇపుడింకనూ కొన్ని మార్పులతో, కొన్ని నూతన విషయములతో, 20 ప్రకరణములను చేర్చి ప్రధమ భాగముగా ప్రకటించుచున్నాము.



# కృతజ్ఞత

ఈ గ్రంధ ముద్రణకు ధన సహాయం చేసిన భక్తులందరికీ యిందుమూలంగా నా కృతజ్ఞతాపూర్వక అభివందనములు తెల్పుకొనుచున్నాను. గ్రంథమును సకాలమునకు ముద్రించి యిచ్చిన శ్రీ వెంకటరమణ ముద్రణాలయంవారికి కూడా నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

*గ్రంథ ముద్రణకు విరాళము లిచ్చినవారు*

1) శ్రీ చౌండ్రాజు రామచంద్రరావుగారు, గాండ్లవాండ్లపల్లె 300-00
2) ,, బిర్లంగి రామమూర్తిగారు, ఖుర్దారోడ్ 260-00
3) ,, అందే సత్యనారాయణగారు, పేరుపాలెం 116-00
4) ,, దాలిపర్తి గోపాల ఆంజనేయులు. వీరి సతీమణి రమాదేవిగార్లు, బందరు 100-00
5) ,, శింగంశెట్టి వీర్రాజుగారు, పెదపట్నపులంక 58-00
6) ,, పూర్ణానంద కొండమడుగుల వెంకటరెడ్డిగారు, వెనిగండ్ల 50-00
7) ,, ప్యాటిబండ సిద్రామప్పగారు, మాచర్ల 50-00
8) ,, పూర్ణానందనడికట్లకొండయ్యగారు. బొంబై 25-00
9) ,, పూర్ణానంద బి. పరమేశ్వర్ గారు అహమ్మదాబాద్ 25-00
10) ,, బోయినపల్లి జగన్నాథంగారు, దబ్బ 25-00

11) ,, మోటూరి భూమయ్యగారు, సంనూరు 21-00

12) ,, గాదిరాజు రామరాజుగారి కుమార్డు
బుచ్చిరాజుగారు, కేశనకుర్రు 20-00

13) శ్రీ B.V.N. రాజుగారు, నాగయ్యపేట 15-00

14) ,, విధేయానంద మొరిశెట్టి రామలింగంగారు
బెల్లంపల్లి 11-00

15) ,, బి. శేషయ్యగారు, 10-00

16) ,, కె. అప్పలస్వామిగారు ఖుర్దారోడ్డు 10-00

17) ,, పడాల అప్పారావుగారు ఒరిస్సా 10-00

18) ,, పి. కాంతారావుగారు 10-00

19) ,, కురుబ సుబ్బారాయుడుగారు,
హిందూపూర్ 10-00

20) ,, మాదాసు రామస్వామి, సూరత్ 10-00

21) ,, గురుకరుణానంద మోసా రామారావుగారు
చినవత్సవలస 10-00

22) ,, వైద్య వెంకటయ్యగారు 10-00

23) ,, దుర్గం వేమాజీగారు, అంకూసం 10-00

24) ,, గాజుల బాలనర్సయ్యగారు, బొంబై 10-00

25) శ్రీమతి బుద్ధరాజు జగ్గాయమ్మగారు, నేరేడుమిల్లి 10-00

26) ,, రుద్రరాజు వెంకటసుబ్బమ్మగారు, మలికిపురం 10-00

28) ,, గాదిరాజులక్ష్మీనర్సమ్మగారు, లక్కవరం 10-00

29) ,, చేకూరి వరలక్ష్మమ్మగారు, 10-00

30) ,, రుద్రిరాజు లక్ష్మీనరసమ్మగారు 6-00
31) ,, మోటూరి లక్ష్మీరాజ్యంగారు 6-00
32) ,, గాదాసు రాజంగారు 5-00
33) శ్రీ యస్. వెంకటనర్సయ్యగారు 5-00
34) ,, మోటూరి ధర్మయ్య, మంచిర్యాల 5-00
35) ,, వజ్జల వీరయ్యగారు, పెద్దకలువల 5-00
36) ,, బాసా సూరన్న, యీా లక్ష్మీగార్లు, దాత్రీరామ 5-00
37) ,, డా॥ బొల్ల సత్యంగారు 5-00
38) శ్రీమతి నిడమర్తి రాజేశ్వరమ్మగారు, హైదరాబాద్ 5-00
39) శ్రీ భూపతి బసవయ్యగారు 5-00
40) ,, తేలకుంట్ల పుల్లయ్యగారు, నడికూడ 5-00
41) ,, ఆర్. వెంకటరెడ్డిగారు, వుండవల్లి 5-00
42) ,, కె. లక్ష్మయ్యగారు బాటసింగారం 5-00

వీరందరికి శ్రీ గురుపరమాత్మ కరుణాకటాక్షములచే ఆయురారోగ్య సుఖశ్రీలు సకల శుభములు సిద్ధించుగాక!



శ్రీమదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి

ప్రియ శిష్యుడు



1. శ్రీ అ. వ. లైన చౌడ్రాజు రామచంద్రరావుగారు

2 వీరి సతీమణి శ్రీమతి సౌ॥ ప్రభావతమ్మగారు

# శ్రీ చౌండ్రాజు రామచంద్రరావుగారు

శ్రీ యుత చౌండ్రాజు సూర్యప్రకాశరావుగారు, అశ్వద్ధమగారు అను పుణ్యదంపతులకు కల్గిన ముగ్గురి కుమారులలో రెండవవారుగా అ.వ. రామచంద్రరావుగారు అంగీరస నామ సం॥ర ఫాల్గుణబహుళ త్రయోదశి అనగా ది 24-3-1933ని సంవత్సరంలో జనన మొందిరి వీరిది ఋక్ శాఖలో అశ్వలాయన సూత్రం. కౌశిక విశ్వామిత్రగోత్రం. అనంతపురంజిల్లా కదిరి తాలూకా, గాండ్లవాండ్లపల్లె వీరి స్వగ్రామం. వీరి పితామహులే యీ గ్రామ నిర్మాణముగావించి కూపతటాక వనప్రతిష్ఠలు గావించి సప్తసంతానయుతులై మహోదాతలుగా కీర్తిప్రతిష్ఠలు గాంచిరి.

శ్రీ రామచంద్రరావుగారి పెదతాత నారాయణప్పగారు వారి కుమార్డు నరసప్పగారు, శ్రీ రామచంద్ర రావుగారిని అభిమాన పుత్రునిగా పెంచి పెద్దచేసి విద్యా బుద్ధులు చెప్పి వివాహాది శుభకార్యములు గావించి తమ యావదాస్తిని వీర్కి సంక్రమింపజేసిరి. వశిష్టగోత్రోద్భవులైన శ్రీ మంచిరాజు నల్లపరాజు వెంకటసుబ్బమ్మ దంపతుల ప్రథమ పుత్రిక శ్రీమతి ప్రభావతమ్మగారి నుద్వాహమాడిరి. వీరికి నల్గురు కుమార్తెలు ఒకకుమారుడు గలిగినారు. శ్రీ రామచంద్రరావుగారు గ్రామకరణంగా మరిన్ని గ్రామ సర్పంచిగా పేరుప్రతిష్ఠ లార్జించుకొన్నవారు. మామగారైన నల్లపరాజుగారున్ను గ్రామ కరణమే.

నేడు శ్రీ రామచంద్రరావుగారు గ్రామ సర్పంచిగా ప్రజల విశేష గౌరవాభిమానముల చూరగాంచి గ్రామమును

విద్యుదీకరణ గావించి గ్రామాభివృద్ధికై కృషిచేయుచూ దాన శీలురై తరుగని కీర్తి ప్రతిష్ఠలార్జించుకొన్నారు.

మానవ జన్మకు సార్థకత జన్మరాహిత్యము పొందుట యేనని వీరు గుర్తించి శ్రీ మదలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి దివ్యశ్రీ చరణములాశ్రయించి పరిపూర్ణబోధ విధానమందు కృషి చేయుచున్నారు.

"మీరు రచించిన ఏగ్రంథమైనను సరే అచ్చువేయించుడు అందుకు నేను రు. 516/-లు అర్పించుకొందును" అని తమంత తాముగా వాగ్దానము గావించిరి. వారికీ వారి కుటుంబమునకూ గురుపరమాత్మ సకల శుభములు చేకూర్చుగాక!

---

శ్రీ బిర్లంగి రామమూర్తిగారు, ఖుర్దారోడ్డు.

చిరంజీవి బిర్లంగి రామ్మూర్తి. ది 13-5-1915 తేదీని శ్రీకాకుళం జిల్లా టెక్కలి తాలూకా బిర్లంగిపేటలో అప్పన్న లక్ష్మమ్మ అను పుణ్యదంపతులకు జన్మించిరి. బిర్లంగి రామయ్యగారు వీరి పితామహులు. పితామహి చిన్నమ్మగారు, శ్రీకాకుళంజిల్లా నర్సన్నపేట తాలూకా నూకపేట గ్రామ కాపురస్తులు నూక రామయ్య అప్పమ్మగార్ల కుమార్తె శ్రీమతి రామలక్ష్మిని వీరు వివాహమాడి సంతానవంతులైనారు. ఆగ్నేయ రైల్వే యందు వుద్యోగస్తులైయున్నారు. వీరుభయులు నావల్లనే ధర్మోపదేశముపొంది జన్మరహిత విధానములో కృషిచేయుచు భక్తిపూర్వకముగా తమంతతామే యీ గ్రంథ ముద్రణకై రు. 250/-లు సమర్పించిరి. గురుకృప వలన వీరి కృషిలో వీరికి సంపూర్ణ విజయము సిద్ధించుచుగాక!

శ్రీమద్రామడుగు శివరామదీక్షిత గురుపీఠ సాంప్రదాయకులు



గ్రంథకర్తగారి శిష్యులు :

1. శ్రీ ఆ. ప. బిర్లంగి రామ్మూర్తిగారు

2 వీరి సతీమణి, సౌ॥ రామలక్ష్మమ్మగారు

# విజ్ఞప్తి

ఈ గ్రంథమును, పీఠాధిపతులగు, శ్రీమదచలఋషి శ్రీ సద్దయానంద హొన్నాల రాజయోగీంద్రులవారికి, కృతి సమర్పణ గావించి, సర్వ హక్కులతో శ్రీమదచల ఋషి రాహుదుగు శివరామ దీక్షిత గురుపీఠ రాజయోగాశ్రమము, (సికింద్రాబాద్) నకు సమర్పించుకొనుచున్నాము.

ప్రథమ భాగ ముద్రణ కేవలం భక్త శిఖామణుల విరాళములతో అచ్చొత్తించినాము. ద్వితీయభాగముద్రణము గూడ, భక్తవరుల వదాన్యతపైననే ఆధారపడియున్నది. ఇది వరలోనే వాగ్దానము చేసినవారలున్న, యితరులున్న గూడా వారిచ్చు మొత్తములను గ్రంథకర్తకు వెంటనే అందచేసినచో ద్వితీయ భాగముద్రణ వెంటనే ప్రారంభించి తొందరలోనే రెండవ భాగము కూడ వెలువరచి తమ కరకమలముల యుందుంచగలము.

రు. 100/-లు పైన విరాళము లిచ్చు వదాన్యులు, ఫొటో బ్లాకులు పంపినచో గ్రంథమునందు ఆఫొటోలు వేయు గలమని రాజయోగిలో ప్రకటించియున్నాము. కొందరు తమ ఫొటోలనుపంపలేదు. పంపినచో ద్వితీయభాగంలో వేయగలం.

ప్రథమభాగ ప్రతులను తాము ఖరీదుచేయుటయే గాక, యితరులచే విరివిగా ఖరీదు చేయించినచో, ఆ ద్రవ్యము ద్వితీయభాగ ముద్రణకు యెంతో తోడ్పడగలదని మనవి.

విద్యుత్ ప్రకాశము లోపించిన అస్పష్ట కాంతిలో ముద్రణ జరుగుతూవచ్చుటచే అనేక ముద్రణాస్ఖాలిత్యములు దొర్లినవి. అందుచే గ్రంథాంతమున జతపరచిన తప్పొప్పుల పట్టిక ననుసరించి ముందుగానే గ్రంథమునందు సవరణలు

గావించుకొనుడని పాఠకులకు మా విజ్ఞప్తి. సర్వదా సోదర భక్తుల సహకార మాశించు బుధజన విధేయుడు,

నర్సాపురం : యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు,
8-5-73 : గ్రంథకర్త.

---

# విషయ సూచిక

శ్రీమదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి

ప్రియ శిష్యులు



గ్రంధకర్త: 1. యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావుగారు

2. వీరి సతీమణి, సౌ॥ శీతామహాలక్ష్మమ్మగారు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ఒకటవ ప్రకరణము

## ఎరుకాభివర్ణనము

గురువు : పరిపూర్ణమందు, లేనియెరుక, దానికదే తోచును.

శిష్యుడు : ఆ యెరుక పరిపూర్ణమందు లేదంటున్నారు గదా! అది ఎక్కడ వున్నట్లు తోచును? ఏవిధంగానుండును.

గు : అంతరనాళ ముఖాంతర మధ్యత్రైలోక్యదర్పణ కల్పిత దృగాకాశమైనదే యెరుక.

శి : ఏమీ అర్థంకాలేదు స్వామీ!

గు : సుషుమ్నానాడి ముఖమునందు త్రిలోకములను ప్రతిఫలింపచేయు శక్తిగల్గిన అద్దమువంటిదై దృశ్యానకు ఆవరణ రూపమైనదని అర్థము.

శి : దాని నింకను వర్ణించండిస్వామీ! తెలియకపోయినా ఎందుకో వినాలనేయుంది.

గు : దహరాకాశ సూక్ష్మరంధ్రాంతర్గత చిన్మయకుహర విరాజమానమై సర్వప్రకాశకమై నిజానంద స్వరూపమైనదే యెరుక. అదే మాయ.

శి : అదే ఆత్మస్వరూపము. ఆ యాత్మే పరబ్రహ్మము, అనిఅందరంటూంటే దానిని మీరు మాయ అంటారేం స్వామీ!

గు : అదే అఖండ మండల మండిత హృదయ పుండరీక మధ్యస్త కీటకం.

శి : అది ఒక పురుగుగా అభివర్ణిస్తున్నారే!

గు : పురుగు వుంటే దొలుస్తూనే వుంటుంది. ఎరుక కూడా అనేక భ్రాంతులను అంతఃకరణమందు కలిగించి కలత పెడుతూంటుంది.

శి : పరిపూర్ణము, ఎరుక, రెండూ ఎంతో సన్నిహితముగు పోలికగలవిగా వుంటాయేమో!

గు : ఎవరంటారు? వుంటే ఉప్పూకప్పూరమూ వలె వున్నాయేమో! పరిపూర్ణముతో సమానమైనది మరియొకటి లేదు. ఎరుకతో సమానమైనదీ మరియొకటి లేదు.

శి : ఎందుచేతనో! కొంచెం వివరించండి స్వామీ!

గు : సిద్ధాంతరీత్యా పరిపూర్ణముతప్ప రెండోదే లేదు. కనుక దేనితో పోలిక చెప్పవలె? తోచేదంతా ఎరుకే అయితే ఎరుక కెరుకతోనే పోలిక చెప్పాలిగాని పరిపూర్ణము వంటిది మరొకటేముంది?

శి : ఐతే స్వామీ! జగత్తు ఎక్కడ తోస్తూవున్నదో చెప్పలేదు. రెండు వుంటేకాని వుత్పత్తి లేదు. ఈ జగత్తు ఏ రెంటి సంయోగంలో తోస్తూవుంది.

గు : ఎరుకే ఎరుకకు స్థానమూ మూలమూగాని మరొకటి లేదు. దేహీ దేహముల సంధిలో గుర్తు ఏర్పడుతోంది. ఇదే చిజ్జడముల సంధి. జగ మీ గుర్తుయందే తోస్తూవున్నది.

శి : ఐతే దేహములు రానపుడు ఎరుక లేనేలేదా?

గు : "దేహీ కావరణమై దేహమాయె" అన్నారు గదా! వ్యష్టిదేహములు లేనపుడు సమష్టి దేహీ దేహములుగా నున్నది. ఇదే స్త్రీపుం నపుంసక భావములతో చరాచరరూపంగావున్నది. ఇదే బ్రహ్మాత్మైక్యమన్నారు.

శి : "సుషిరజనిత ప్రకాశభాసమానమై కనుదర్పణమందున సర్వము తెలియచేస్తూవుంటున్నది" అన్నారే!

గు : చక్షువునకున్మీల నిమీలనములున్నవిగదా! అంతే గాదు. కన్నులేలేనివారి మాటయేమి?

శి : "జ్వాలకాలానలాభాసా, తటిత్కోటి సమప్రభా" ప్రజ్వలించి మండిపోతూవుండే దావాగ్నివలె, కోటి మెరుపులు కూడినంత ప్రకాశముతో అది వెలుగుచుండునన్నారు.

గు : మహత్వ, కవిత్వ, పటుత్వ సంపదతో అట్లు అభివర్ణించినారు.

శి : అది సత్యము కాదంటారా? దాని నిజాభిప్రాయమేమి?

గు : మంటలు, కాంతులు యిత్యాదులన్ని అగ్నిభూత సంబంధములు. అగ్నిభూతమే యుత్పత్తి కానపుడు. నామరూప విజృంభణే లేనపుడు, దానికొకరూపమా?

శి : ఐతే అది మరెట్టిదో చెప్పండి స్వామీ!

గు: చిత్స్వరూపమై, అష్టతనువులచేత పరివేష్టితమై, సృష్టికి వుద్భూతకారణమై, కర్తృత్వాద్యహంకార మూలమైనది యెరుక. అదే సర్వభ్రాంతులకు మూలము దీనిని

హరించుట ఎవరికి సాధ్యముగాదు. గురుకృపచేత తప్ప యెరుక హరించదు.

శి : దేవతలకూ మహిమాన్వితులగు మహాత్ములు గలవారికీ మాత్రము సాధ్యమేమో!

గు : కాదు. హరిహర బ్రహ్మాదులకైన నలవికాదు. సముద్రము నాపోశనము పట్టిన అగస్త్యుడు, హాలాహలము మ్రింగిన శివుడు, కార్చిచ్చు కబళించిన కృష్ణస్వామి వంటి వారికిగూడ గురుకృపలేక సాధ్యంకాదు.

శి : ఏమేమి? ఎరుకంతటి బలీయమైనదా?

గు : లేనిదానిని, వున్నట్లుగాచూపి సర్వభ్రమల పొంద జేయును. వున్నదానిని మరుగుపరచి లేనిదానిగా తోపింపజేయును.

శి : ఎట్లా చేయగలదు స్వామీ!

గు : ఆ యెరుక మనస్సుతో గూడి బహిర్ముఖమై, దృక్స్వరూపమైన తనయందు, దృశ్యప్రపంచాధ్యారోపణచేసి ఆవరణ, విక్షేపములచేత, దానికాధారమైన అజ్ఞానముతో గూడి, జనన మరణ ప్రవాహరూపమైన సంసారమందు, మునుగుచూ తేలుచూనుండును.

శి : ఎరుకకు స్థానమేది?

గు : ఎక్కడ జ్ఞానమున్నదో అక్కడేవున్నది. చక్షురాది గోచరమగు సమస్తమును గ్రహించి చిదాకాశమే, హృదయకర్ణికా మధ్యస్థచిద్బిందుదర్పణమందు సాక్షియైవున్నది.

శి : ఆత్మయున్ను జ్ఞానమున్ను వేరుగా తోస్తున్నవి రెంటికీ గల సంబంధమేమి?

గు : సమవాయ సంబంధము అనగా కారణలక్షణము కార్యమునందుండుట. జ్ఞానరూపంగా ఆత్మే సర్వమునందున్నది.

శి : జీవులయందీ జ్ఞానమున్నదని తెలుస్తూందిగాని జడరూపమైన జగత్తునందు యిది ఎక్కడ యేరూపంగానున్నది?

గు : జడమనేది ఎక్కడుంది? ఆత్మ సర్వవ్యాపకము. దేనియందైనా ఆత్మలేనియెడల జడమనవచ్చు.

శి : పోనీ జడమననుగాని ప్రాణంలేని వస్తువులయం దేరూపంగానున్నదో తెలుపీయండి స్వామీ!

గు : శబ్దస్పర్శాదులు లేని దేముంది? ఆ శబ్దాదులకు ఆత్మయే అధిష్ఠానము గనుక అదిన్ని ఆత్మయే అనవచ్చును.

శి : జీవ, జగత్తుల రెంటియందు ఏదో ఒక లక్షణముతో ఆత్మ ప్రకాశించాలిగదా! ఆ సమాన లక్షణమేదో తెలుపీయండిస్వామీ!

గు : అస్తి, భాంతి, ప్రియ (లేక సత్, చిత్, ఆనంద) లక్షణములే అన్నిటియందుగల సమానలక్షణములు, ఆత్మ యీ లక్షణములచేత సర్వమునందూ గానవస్తూనేయున్నది.

శి : పరిపూర్ణమందు, జ్ఞానము ఏరూపంగానూ లేదా? జ్ఞానం లేకపోవుట అజ్ఞానము. కనుక పరిపూర్ణము అజ్ఞాన

ము తో నిండియున్నదన్న మాట.

గు : ఓయీ! అజ్ఞానము, జ్ఞానము యొక్క మారురూపమే సుమా! యెఱుగుట జ్ఞానము. మరచుట యనేది అజ్ఞానము. యీ జ్ఞానాజ్ఞానములు రెండూ ఒక జ్ఞానానివే బాహ్యా, బారుసూ ఒకే నాశౌమునకు సంబంధించినవే గదా!

శి : అన్నిటియందూవున్న యెఱుక యొక్క లక్షణములలో ఒక్కటైనా పరిపూర్ణమం దెందుకులేదో ఆశ్చర్యముగా వున్నది.

గు : ఆశ్చర్యమేమున్నది? ఆ పరిపూర్ణమందు ఎరుక నిలుచుట కవకాశమేలేదు. ఎఱుకే లేకుంటే దాని లక్షణములెట్లుండును? ఎరుక వుంటే అది పరిపూర్ణం కానేకాదు.

శి : మరి ఆ పరిపూర్ణము నెట్లా భావించవలెను?

గు : భావించడానికి అది వస్తువేకాదు. అస్తి, భాతి, ప్రియ లక్షణములు లేనేలేవు. అది (1) ఛాయారహితము (2) మాయారహితము (3) క్రియారహితము. దాని కుత్పత్తి నాశములులేవు.

శి : ఎందుచేత?

గు : అది వస్తువు అయితే వుత్పత్తి నాశము లుంటాయి గాని అది వస్తువేకాదు. వస్తుధర్మములైన అణుత్వ, గుణత్వములు, లఘుత్వ, గురుత్వములు, కర్మధర్మములు, నామరూపాది వికారములు, శక్తిసామర్థ్యాలు

వస్తుధర్మములు. కనుక అట్టి ధర్మములు లేనిదానికి వుత్పత్తీ లేదు. నాశనమూ లేదు.

శి : దృక్ దృశ్యముల రెంటిలో దృక్కు బ్రహ్మము, దృశ్యము, మాయ అనీ, కనుక దృశ్యము మాత్రమే నశ్యమనీ అంటారే!

గు : దృక్, దృశ్యములు రెండూ ఒకటే. దేహీ దేహములు రెండూ ఒకటే, ద్వయంగా వున్నట్టు తోచినా ఏకమే అదే వుపాధిద్వయము. వున్నంతసేపూ వుండును. లేకుంటే ద్వయదోష రహితం. ఒకటితోనే రెండూ లేవు ద్విపుటీ త్రిపుటులుగా తోచే సర్వమునకు ఎరుకే మూలము.

శి : కార్యకారణ పరంపరగా ఒకదానికొకటి మూలంగా కానవస్తూనే వున్నాయిగదా! అన్నిటికి మూలమైన ఎరుకకు మూలమేమి?

గు : దానికి మూలములేదు. అది అమూలము. మూలం లేకుంటే అది సత్యమా! కనుకనే దానిని మూల మాయ అన్నారు.

శి : మూలమందు ఏమీ లేనిదానివల్ల వచ్చిన యీ వస్తమూ ఏమీ లేనిదే అగును.

గు : అట్లని వ్యవహారం మానగలవా? గనుక వ్యవహారమునందు ధర్మప్రవృత్తి ఏమరకూడదు సుమా!

శి : యితర సిద్ధాంతము లెట్లున్నవి?

గు : ఎరుకే బ్రహ్మమను భ్రాంతిలోనే వున్నవి.

శి : సరేకాని, జ్ఞానాజ్ఞానములు రెండూ ఒకటే అనే మాట నాకు బోధపడలేదు స్వామీ!

గు : వెలుగు చీకటిని యెరుకపరచును. వెలుగుంటేనే కీనీడ (చీకటి) తోచును. వెలుగు అనే మాట, చీకటి అనే మాట వుండబట్టే పుట్టింది. అట్లే చీకటి అనే మాట, వెలుగనే మాట వుంటేనే పుట్టింది. వీనిని అన్యోన్య సాపేక్షికములంటారు. అట్లానే జ్ఞానాజ్ఞానముల రెంటినీ గుర్తించేది ఒకే జ్ఞానము. ఒకే అంతఃకరణ, రెంటికీ స్థానమున్ను అయివున్నది. జ్ఞానమందే అజ్ఞానము; అజ్ఞానమునందే జ్ఞానము.

శి : అదెట్లు స్వామీ!

గు : జ్ఞానము కల్గినపుడు అక్కడున్న అజ్ఞానము (జ్ఞానము లేనితనము) ఎక్కడకు పోయింది? అక్కడే మరుగుగా వున్నది. ఇంతలో విస్మృతి (మరుపు) కల్గినది. అపుడు అది వరకున్న జ్ఞానమెక్కడకుపోయినది? అక్కడనే మరుగుగావున్నది. కనుక జ్ఞానమందు అజ్ఞానము అజ్ఞానమందు జ్ఞానము.

శి : దేహీ దేహములకు భేదము లేదన్నారే అది యెట్లు?

గు : చిదాకాశమునందు జగత్తు తోస్తూన్నది. చిదాకాశం లేనేలేదు. "ఆకాశం గగనం శూన్యం" అంటున్నారు గదా! చిదాకాశం లేకుంటే జగత్తు లేదు, దేహముంటే దానితో అహంకారమూ వున్నది. దేహంపోతే ఆ అహంకారం దేహంతో పోవుటలేదా! దేహముంటేనే

దేహి అను పేరూ, దేహీవుంటేనే దేహమను పేరూ వచ్చాయి. ఒకటి లేకుంటే రెండూ లేవు. కనుక రెండూ ఒక్కటే. ఈ భావము అధిష్ఠానస్థానమందు విచారిస్తే బాగా దృఢమవుతుంది.

శి : సాకారమందూ, నిరాకారమందూయున్న దేనన్నమాట!

గు : అవును. సమస్తోపాధులందు ఎరుకే వుండును. అంతా అదే కనుక అందరూ దానిని బ్రహ్మమనినమ్ముతారు. అంతకంటె మాయ అవనిలోలేదు. గురుకృపచేత మేలుకొంటే ఆ బ్రహ్మకల్పన అంతా బ్రహ్మము తోనే పోతుంది. గురుకృపచేత అట్టి యీ యెరుకను ముంచివేస్తే ఎప్పటికీఏవికారములూఏభయములూ లేవు.

శి : ఉపాసనకు సాకారము మంచిదా? నిరాకారము మంచిదా?

గు : బ్రహ్మోహం అని నిరాకారమును భజించడం, బంగారు సంకెళ్ళు; శివోహం అనుట సాకారము, యినుప సంకెళ్ళు; జీవోహం అనేది నూలు సంకెళ్ళు అజ్ఞానము. బంగారపు సంకెళ్ళకు భ్రాంతీ బలమూ యెక్కువ. అది యోగులను కూడా రాగమందే ముంచును.

శి : మరి దీనికి విమోచనమెట్లు స్వామీ!

గు : చెట్టు వేళ్ళతో గూడా మొదలు కొట్టితేనే చచ్చును. కాని చివరలు చిదిమితే మళ్ళీ చిగురిస్తూవుండును. ఆ నేర్పు తెలిసిన గురువులకు దుర్లభము కాదు, స్వాభావికమే, ఎరుక పుట్టనేలేదు, *

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## రెండవ ప్రకరణము

## ఆత్మ - భావభావములు

శి : ఆత్మ యెటువంటిది?

గు : సత్యజ్ఞానానంద స్వరూపమైనదే ఆత్మ

శి : సచ్చిదానంద స్వరూపమే ఆత్మ అని కొందరంటారు గదా!

గు : ఎట్లా చెప్పినావకటే. సత్యమేసత్తు, జ్ఞానమేచిత్తు, అనంతమే ఆనందము, ఇటువంటి స్వరూపము గల దానినే వారు బ్రహ్మమన్నారు.

శి : దానిని మీరేమంటారు?

గు : అది మాయయేనంటాము.

శి : యెందు చేత?

గు : దానికి గుణస్వరూపములున్నవి. అది భావభావము లున్నా కాదు. భావభావములున్నా అగును. కనుక అది అనిర్వాచనీయమైన మాయా స్వభావముకలది.

శి : అదియెట్లు?

గు : అది సత్తనీ, చెప్పరాదు. అసత్తనీ చెప్పరాదు. సదస త్తనీ చెప్పరాదు.

శి : సత్యమని ఏల చెప్పరాదు?

గు : దేహేంద్రియములను విడిస్తే అప్పుడే లేదు, వున్నదని అన్నా లేదు. అది సత్యమైతే దాని వలన కల్పనైన గుణకల్పనలన్నీ సత్యమే కావలసియుండును. నామ రూపగుణములు మిథ్యయని అననేల?

శి : అసత్తనగానేమి? దానిని అసత్తని ఎందుకనరాదు?

గు : అసత్తనగా, గగనారవిందశశశృంగములవలె ఏ కాల మందునూ లేనిది. ఆత్మ అటువంటిది కాదు. సమస్త మును గుర్తెరిగి విచారిస్తూ వున్నది. పరిపూర్ణపర బ్రహ్మమువలె నిత్యసత్యము కాకపోయినా దాని యందేదో సత్యత్వము కానవస్తూవున్నది. కనుక అలీక పదార్థమువంటి కేవల అసదూపవస్తువు కాదు.

శి : సదసత్ అని చెప్పితేనో?

గు : అది విరుద్ధము. అట్లు చెప్పుట అప్రశస్తము.

శి : అది కేవలం భావపదార్థము కాదనిపిస్తోంది. అభావ పదార్థమగునేమో చెప్పండి స్వామీ!

గు : అభావపదార్థములు ఆరు విధములు. (1) ప్రాగ భావము (2) ప్రత్యగభావము (3) అత్యంతా భావము (4) అన్యోన్యాభావము (5) వ్యావృదా భావము (6) ప్రావృదాభావము.

శి : వీనిని వివరించి ఆత్మ ఏ అభావ పదార్థమో శెల వీయండి?

గు : ప్రాగభావమనగా పూర్వమునందు అది లేదనుట. ఉదా: కుండ తయారగుటకు ముందుకుండలేదు అనుట.

అనగా యిప్పుడుగాని యికముందుగాని వున్నది, వుంటుంది, అని చెప్పినట్లే. యెరుక యిక ముందునూ వుండేదికాదు, కనుక ప్రాగభావము కాదు.

శి : ప్రత్యగ భావమేమి?

గు : ప్రత్యగభావమనగా పూర్వమందువుండి యిప్పుడు మాత్రమే లేకపోవుట. ఎరుక యిప్పుడు మాత్రమేగాక త్రికాలములయందు లేదు, కనుక అది ప్రత్యగ భావము కాదు.

శి : కనుక యెరుక అత్యాంత భావమైనది. అనవచ్చును?

గు : అనరాదు, దానికి పరమసత్యత్వము లేకపోయినా వ్యవహారిక సత్యత్వము వున్నది. వున్నానని తోచబడు చునే యున్నది. కనుక అది అత్యంతాభావము (అనగా అసలే లేనిది) అనరాదు.

శి : స్వామీ అన్యోన్యాభావమని అనవచ్చునా?

గు : ఆకాశము సర్వత్రవ్యాపకము. దాని గుణమైన శబ్ద మున్నూ అంతటా వున్ననూ, ఒక చేతితో మరొక దానిని కొట్టిననే శబ్దము కలుగుచున్నది. ఏచేతిలోనూ శబ్దము కానరాదు. రెంటిని కలిపి కొట్టినచో శబ్దము కలుగును. యిదే అన్యోన్యాభావమునకు దృష్టాంతము యెరుక యిట్టి అభావమున్నూ కాదు.

శి : వ్యాహృదాభావమనగా నేమి? ఇదేమైన సరిపోవు నేమో తెలియ జెప్పండి స్వామీ?

గు : సూర్యోదయానంతరం, ఆ సూర్యప్రకాశములో ఎవరి

కర్మలు (పనులు) వారు చేసికొనుచున్నారు, మీ మీ కర్మలు చేసుకొండని సూర్యుడు వారికి చెప్పలేదు. ఐనను అతడున్నప్పుడే సర్వకర్మలు జరుగుచున్నవి కనుక అవి సూర్యుని వలన జరుగుచున్నటులే భావించవచ్చును. అలాగే ఆత్మవలన అగుచున్నవి అని చెప్పుట సరి కాదు. ఏలవనగా సూర్యుడు ప్రత్యక్షముగా కాన వస్తువున్నాడు. కనుక వ్యాహృదాభావము చెప్పరాదు.

శి : యింతకీ వ్యాహృదాభావమును తమరు వివరించనేలేదు స్వామీ?

గు : క్షణమాత్రమేవుండి అపుడే పోయి మళ్ళీ వచ్చునది, వ్యాహృదాభావము, మెరుపువలె, జలబుద్బుదమువలె క్షణికమైనది. ఇవి అన్నియూ నేత్రగోచరములు. మరియు ఏదో ఆధారముచేత గల్గినవి. ఎనుక అట్టిది కాదు స్వయంభువు. యింద్రియగోచరము కానిది. కనుక వ్యాహృదభావము కాదు.

శి : ప్రాహృదాభావము కూడా ఏల చెప్పరాదో తెలపీయండి స్వామీ?

గు : వాయువువలె రూపము లేనప్పటికీ కార్యత్వేనా తోచబడేది ప్రాహృదాభావము. యెరుక అట్టిది కాదు. కార్య కారణములు చెప్పరానిది. తనకు తానే కారణం, తనకు తానే కార్యం. కనుక ప్రాహృదాభావము కాదు.

శి : అది ఏదీ కాదంటే ఎట్లా స్వామీ?

గు : అన్ని భావాభావములు అదే. అన్నీ అవును. అన్నీ కాదు.

శి : అది అవాఙ్మానసగోచరమా?

గు : కాదు, ఏలాచెప్పినా సరేపోతుంది. సరిపోనూ సరిపడదు. కనుక మాయవలె అదిన్ని అనిర్వచనీయము.

శి : అనిర్వచనీయమునకు వాఙ్మనోతీతమునకూ తేడాఏమి?

గు : అనిర్వచనీయమంటే దానికొక సమగ్రముగు నిర్వచనం యిదమిద్ధమనిచెప్పరానిది. చెప్పిననిర్వచనంసరిపోవును సరిపోదు తద్వ్యతిరేకముచెప్పినా సరిపోయినట్లుంటుంది. విచారిస్తే అదీసరిపోదు. అనిర్వచనీయమనగా అనేకనిర్ణయములుచేయుటకు వీలైనదన్నమాట. అవాఙ్మానసగోచరం అంటే, అది మనస్సునకు అందనే అందదు కనుక అసలు ఏ నిర్వచనమూ చేయరానిది. మనస్సుకందినా, వాక్కుకు లొంగినా అది యెరుకే అని గుర్తించు. ఎల్లకాలముండే ఏకైక వస్తువగు పరిపూర్ణమందు ఎరుక లేనేలేదు. అది పుట్టుటకు మూలమున్నూలేదు. కనుక ఎరుకపుట్టనేలేదు అని సిద్ధాంతం.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

### మూడవ ప్రకరణము

## జగదుత్పత్తి.

గు : పరిపూర్ణమైన బట్టబయలులో చిజ్జడములుపుట్టనే లేదు.

శి : నేను సత్యము, దేహ మసత్యము; బ్రహ్మము సత్యము జగత్తు మిథ్య అని, కొందరెందుకంటారు?

గు : అవును. అది అద్వైతవాదము. జగత్తు లేదనుట కంటె నీవే లేవనుట లెస్స.

శి : ఎందుచేత?

గు : సకలము చూస్తూ, సకల కర్మలు చేస్తూ, పుణ్యపాపములు అనుభవిస్తూ, తాను సత్యము ప్రపంచము అసత్యము, అని ఏలాగన్నారు?

శి : తెలియదు.

గు : విశ్వోత్పత్తికి కారణమే లేని బ్రహ్మమందు, ఉత్పత్తి స్థితి, నాశనములుగల ప్రపంచమేలాగున పుట్టును? (౨) అట్టి పరబ్రహ్మము వలన పుట్టిన జగత్తు పరబ్రహ్మము వలెనే యుండవలెను. గాన ప్రపంచములో జనన మరణములుండకూడదు.

శి : ఔను. నిరాకారమందు సాకారము బుట్టునా? అట్లు చేసితే నిరాకారమునకు హానికాదా? లోకమందు

మనుష్యులకు కుక్కలు నక్కలు బుట్టునా? పుట్టవు. అలాగే నిరాకారమైన పరిపూర్ణ బ్రహ్మమందు సాకారమైన ప్రపంచము పుట్టదు.

గు : మరిన్ని—చావు పుట్టుకలు ప్రపంచమునకేగాని పర బ్రహ్మమునకు లేవు. తండ్రి వలన పుట్టిన కుమారుడు తండ్రివలె నగునుగాని వేరగునా? తండ్రి నిత్యుడైతే కొడుకున్నూ నిత్యుడు కావలె. తండ్రికి నాశనముంటే కొడుకునకున్ను నాశనముండవలె. కాని తండ్రినిత్యుడూ కుమారుడనిత్యుడూ అనిన బాగుండదు. అట్లన గూడదు, వినగూడదు. ఉంటే రెండూ వుండవలె. లేకపోతే రెండూ లేకపోవలె.

శి : అవును. కార్యకారణ సంబంధమట్టిదే కదా! మరి, బ్రహ్మము జగత్కారణమని శ్రుతులన్నియు ఘోషిం చుచున్నవే?

గు : దేహమున్నంత వరకు యింద్రియ చలనత్వ మెటువలె నుండునో అటువలెనే కారణమున్నంతవరకు కార్యము లేకపోదు. నిర్వికారమైన పరిపూర్ణ బ్రహ్మమునందు కారణ కర్తృత్వము చెప్పకూడదు. జగత్కారణమని చెప్పబడినదేదో ఆ బ్రహ్మమే మాయా బ్రహ్మము. (ఎరుక)

శి : శ్రుతి ననుసరించి బ్రహ్మమునకు, జగత్కారణమంగీ కరిస్తే, యేమి సిద్ధించును?

గు : కార్యరూపమైన జగత్తునకు, ఉత్పత్తి స్థితి నాశనము

లున్నట్లే కారణరూపమైన మాయాబ్రహ్మమునకు (ఎరుకకు) కూడా అట్టి వుత్పత్తి స్థితినాశనములే యుండక తప్పదని సిద్ధించును.

శి : అట్లాగైతే ఆ కారణ బ్రహ్మము కూడా జగత్తువలెనే మిధ్యావస్తువేగాని సత్యముగాదని అనవలసివుండును.

గు : అవును. కారణకర్తృత్వములుగల బ్రహ్మమునకీపాట్లు తప్పవు. మరి కొందరు బ్రహ్మమువల్ల జగత్తుపుట్టి వేరుగాకుండావున్నదన్నారు.

శి : బ్రహ్మమువల్ల బుట్టి బ్రహ్మముకంటే వేరుగాకుండా వుండుటెట్లు?

గు : "ఛాయవత్" అన్నారు. అనగా ప్రపంచము బ్రహ్మము యొక్క ఛాయయేగాని వేరుగా పుట్టలేదని అన్నారు. చూడడానికి, మనిషిఛాయ మనిషివలె గానరాలేదా?

శి : ఆలాగైతే రెండూ ఒక్కటే అగును.

గు : అవును. మనిషి లేకపోతేగదా ఛాయ లేకపోవును. అట్లనే జగత్తు లేకపోవలెనన్న బ్రహ్మమే లేకపోవలసి యుండును.

శి : అట్లయితే జగత్తువంటిదే బ్రహ్మమూను అనవలసినదే!

గు : ఇంకొక్కమాట. సాకారమందే ఛాయవుండునుగాని నిరాకారమందు ఛాయవుండదు. ఛాయఎప్పుడువుందో అప్పుడది దృశ్యకోటిలోనే చేరగలదు.

[illegible] న్నశ్యం" బ్రహ్మము కూడా నాశనశీల [illegible] ను. కనుక ఛాయాదృష్టాంతము పనికి

రాదు. అని తేలుచున్నది.

గు : మరికొందరు వేదాంతులుతోచి కానవచ్చిన విశ్వము లేదని అన్నారు.

శి : ఎండమావులవలె విశ్వము తోచుచున్నదే కాని, నిజముగా ఏమీ లేదని వారిభావమా?

గు : అవును. కారణాభావమందు కార్యముండదు. ఎండమావులకు కారణమైన, యెండయే లేకపోతే ఎండమావులూవుండవు. కనుక ఎండమావులు తోచకుండావుండాలంటే యెండేవుండకూడదు. అట్లే జగత్తును మిధ్యగా ప్రతిపాదిస్తే దానికి కారణమైన బ్రహ్మమును సత్యముగా ప్రతిపాదింపరాదు.

శి : అట్లైతే యితరులు చెప్పిన దృష్టాంతములన్నీ పూర్వపక్షమై పోయినట్లే. మరి మీరు యెరుక పుట్టనే లేదంటున్నారు కదా! అదెట్లు సరిపోవును?

గు : అవును. జగత్తునకు అత్యంత మూలకారణమైన యెరుకయే పుట్టలేదంటున్నాము.

శ్లో॥ సర్వశూన్యం మయారూపం జన్మ శూన్యం స్వభావతః
జన్మాభావేన మృత్యుశ్చ పరిపూర్ణం స్వభావతః॥

శి : యిందుకు శాస్త్రవాదు లేమన్నారు?

గు : అల్పగురు బోధ పరాయణులైనవారు నిజాభిప్రాయము మెరిగిన వారుకారు.

శి : సరే, మరి ప్రపంచం మాటయేమిటి?

గు : ప్రపంచము వుంటే లేదనెనా? లేకుంటే లేదనెనా? ప్రపంచముంటే లేకపోదు. లేకుంటే, ఎందుకు పేరు వుండవలె? లేదంటే, ప్రత్యక్షముగా గానవచ్చేది లేదనటం, మాయావాదం కాదా?

శి : కొందరు లేనివానికి పేర్లువున్నవని అన్నారు. అది యేలాగంటే శశవిషాణవత్, గగనకుసుమవత్, చందన పుష్పవత్, చిత్రవిగ్రహ జీవవత్, కనకసుగంధవత్ మృతాకాశవత్, సువర్ణ కార్పాసవత్; నామధేయం మాత్రమేకాని జగత్తు లేదని అన్నారు.

గు : ఐతే ప్రపంచం అటువంటిది కాదు. పైన చెప్పబడినవి కానరావు. యీప్రపంచము ప్రత్యక్షంగా కానవస్తూండగా లేదని అనరాదు.

శి : కొంతమంది, మాకు గానరాలేదు. నీకు భ్రాంతివున్నది కాబట్టి నీకు గానవస్తూవున్నది. మాకు భ్రాంతిలేదు. మాకంతా పరబ్రహ్మమే అంటున్నారే?

గు : ఇదే మాయావాదం. అంతా పరబ్రహ్మమేనైతె దర్వాజాలో నుండి ఎందుకురావలె? ఎటుబడితే అటుపోకూడదా? ఇది త్రోవ, యిది అరణ్యము, యీ కుడ్యము (గోడ) అని ఏల ఆలోచనయుండవలె? అనుభవము లేక, శాస్త్రములు చదివి. అనుట మాత్రమే దీని పేరు వాచాద్వైతమే గాని, అనుభవ అద్వైతముకాదు. ఇంతె మాత్రమున అహంకారం పెడదు,

శి : "మాకు పాపపుణ్యములు లేవు. వున్నవనివిశ్వాసమే లేదు. పాపపుణ్యములు యెక్కడవున్నవి? నేనే బ్రహ్మమును నాకేమీ అంటదు" అంటున్నారు.

గు : ఆలాగైతే అగ్నిహోత్రం పైనవేస్తే తిన్నగా వుండ రాదా? సర్పమును పైనవేస్తే కదలకుండా యుండ రాదా? కర్మాలు చేస్తే తిర్గి జన్మవస్తుందని పుణ్య కర్మాలు పరిత్యజించి, పాపకర్మాలు చేస్తూవుంటారు. యిదే మాయాద్వైతం, తమకు యేమీలేకుంటే కొట్టి నపుడూ, తిట్టినపుడూ, అవమానించినపుడూ, సన్మా నించేటప్పుడూ, ఒకే తీరుగా వుండరాదా?

శి : అట్లా వుండగల్గిన వారెవరున్నారు?

గు : తాను వుండి ప్రపంచము లేదనెనా? తానులేక ప్రపం చము లేదనెనా? తానే లేకుంటే, లేదనేది ఏమివున్నది? తాను వుండగా ప్రపంచము ఏలాగున అబద్ధము? తానులేక పోయినందుకు ఏమి దృష్టాంతము? ప్రపం చమే తాను, తానే ప్రపంచము.

శి : ఆకల్పంలో రెండూ సత్యమేననాలి, లేక రెండూ అసత్యమేననాలి.

గు : ప్రపంచము పుట్టకుంటే, వున్నదని ఎట్లనిరి? లేదని యెట్లనిరి? అన్నప్పుడు వున్నదా? లేకనేపోతే లేదనడమెందుకు? పుట్టకపోతే ఎవరూ అనరు. కనుక ప్రపంచము పుట్టినది. అనియే తీరాలి.

శి : ఏలాగున పుట్టెనో, పుట్టుటకు కారణమేమో శెల వీయండి స్వామీ!

గు : ఈ ప్రపంచము, మరుమరీచికవత్, రజ్జుసర్పవత్, శుక్తి రజితవత్‌గా తోచినదని కొందరంటారు.

శి : ఈ దృష్టాంతములు సరిగా నున్నవా?

గు : లేవు. కారణమేమంటే. ఆ భ్రాంతి యెవరికి తోచెను? ఆ బ్రహ్మమునకే తోచెనా? లేక రెండవవారికి తోచెనా? అపుడు రెండవవారెవరూ లేనేలేరుగదా! బ్రహ్మము నిర్వికల్పుడు అంటూ, భ్రమసినాడని చెప్ప కూడదు. అసలు భ్రమ అనుటకు రెండోది ఏమి వున్నది? కనుక ఈ దృష్టాంతములు పనికిరావు. గురు కటాక్షవిహీనులైన శాస్త్రజ్ఞులును, అల్పబోధ పరా యణులున్నూ అన్నమాట లేగాని, అవిఒప్పిదములుకావు.

శి : అన్యవాదము లింకేమైన నున్నవా?

గు : కొందరు పాలు పెరుగైనట్లుగా బ్రహ్మము విశ్వమైన దని అన్నారు. ఇదిన్ని పనికిరాదు. పాలుచెడి పెరుగై నట్లుగా బ్రహ్మముచెడి విశ్వమైనాడంటే అచలుడు, అవ్యక్తుడు, అనే మాటకు లోపం వస్తుంది. మరిన్ని జగత్తు ప్రళయకాలమున తిరిగి బ్రహ్మమేయగుచున్నది కాని పెరుగుగా మారినపాలు, తిరిగి పాలుగా మారుట లేదు, అందుచే గూడ యీ దృష్టాంతము సరిపోదు.

శి : ఐతే, కారణ కార్యరూపంగా, ఒక్క బంగారమే అనేక సొమ్ములు (నగలు) అయినట్లుగా, లేక మట్టి ఒక్కటే అనేక కుండలు అయినట్లుగా బ్రహ్మము విశ్వమైనాడనుట సమంజసంగా వుంటుందేమో?

గు : బంగారము తెచ్చి కరగించి, సుత్తులతోకొట్టి, అనేక

పనిముట్లుతో కంసాలి ఆభరణములు చేసినట్లుగా, బ్రహ్మమును అనేక రూపములుగా మార్చెడివాడున్న వాని పనిముట్లున్ను వున్నవని చెప్పవలసివచ్చును. అట్లు బ్రహ్మము విషయంలో చెప్పరాదు గదా!

శి: నారికేళమందు జలము, ఏలాగున పుట్టినదో అట్లే బ్రహ్మమందు విశ్వము పుట్టింది, అనుట సరిపోవునా?

గు: అట్లున్నా చెప్పకూడదు. ఏమంటే, భూమివుండవలె విత్తనముండవలె, నీటి చెమ్మ వుండవలె; యివన్నీ వుంటేగాని కొబ్బరి చెట్టు మొలచి, కాచి కాయలలోనికి నీరురాదు గదా! ఆ విధంగా భూమి వంటి ఆధారముగాని, విత్తనముగాని పోషించువాడు గాని ఎవరున్నారు? ఇవన్నియు బ్రహ్మమునందు చెప్పగూడదు.

శి: తంతువులు చెడకనే పటములైనట్లుగా (నూలు వస్త్రములైనట్లుగా) బ్రహ్మము చెడనక్కర లేకుండానే విశ్వమైనాడని కొందరంటున్నారు.

గు: బట్టలు నేయుటకు సాలివాడు వుండవలెను గదా! ఆ విధంగా బ్రహ్మముగాక వేరేకర్త మరొకరున్నారని చెప్పరాదు. మరిన్నీ అనేక పోగులు కలిస్తేనే గదా పటముమాను౽ అయితే యెంతమంది బ్రహ్మములు కలిస్తే విశ్వమాయెను? "ఏకమేవా? ద్వితీయం బ్రహ్మ" అనీ, "నేహానానాస్తి కించన" అనీ. శ్రుతులు పలుకుచున్నవి. కనుక అట్లున్నా చెప్పకూడదు.

శి: మేడిపండునందు దోమలు పుట్టినట్లుగా బ్రహ్మమందు

విశ్వం పుట్టినదని, మేడిచెట్టున కాయలు ఏలాగున వున్నవో ఆలాగుననే బ్రహ్మమందు అనేక బ్రహ్మాండములున్నవనీ, కొందరన్నారు.

గు : అట్లనకూడదు. నారికేళ దృష్టాంతమునకు పైన చెప్పిన ఆక్షేపణలే, దీనికిన్ని వర్తించును.

శి : సాలెపురుగు (ఊర్ణనాభి) పోగులచేత ఏలాగున గూడు అల్లినదో. ఆలాగే బ్రహ్మము మాయను ఆధారం చేసుకొని విశ్వమును పుట్టించెనని కొందరన్నారు.

గు : ఇవన్నియు సత్యజ్ఞానానంద స్వరూపమైన మాయా బ్రహ్మమైన, మూలంలేని యీగుర్తెరిగే శరీరమునకు చెప్పిన మాటలేగాని పరిపూర్ణమైన బ్రహ్మమునకు చెప్పిన మాటలు కావు.

శి : సత్యజ్ఞానానంద స్వరూపమైన చైతన్యమే, నిర్గుణ బ్రహ్మమని అనేకులు చెప్పుచున్నారే!

గు : నిర్గుణమైతే విశ్వమును పుట్టించేటందుకు గుణమేది? గుణము లేకుంటె యేలాగున పుట్టించును? ఎప్పుడు పుట్టించునో, అప్పుడు సగుణమేకాని నిర్గుణము కాదని చిన్నపిల్లవానికైనా తెలుసును. సగుణమంటేనే విశ్వోత్పత్తి సంభవించును. ఇందుకు బ్రహ్మోపనిషద్వాక్యం "నిర్గుణం, నిశ్చలం, సత్యం; సగుణం నశ్యతి ధృవం"

శి : నదియందు, తరంగములు బుద్బుదములు ఏలాగున పుట్టినవో ఆలాగుననే, బ్రహ్మమందు జగత్తు పుట్టినదని అన్నారు. దీనికేమి సెలవు?

గు : నదియందు వాయు సంయోగమువలన తరంగ బుద్బుదములు పుట్టినవేగాని ఊరికే పుట్టలేదు. జలము పదార్థరూపము. ఆ పదార్థమును వాయువు చలింపచేయగా తరంగాదులు పుట్టినవిగాని నిష్కారణముగా పుట్టలేదు. బ్రహ్మమందు చలనము చెప్పగూడదు గదా!

శి : చలనముంటేగాని, జగత్తు పుట్టదని సిద్ధాంతమే.

గు : ఐతే అచలమని చెప్పిన మాటకు హాని వచ్చును.

శి : కొందరు అగ్నియందు మిణుగురులు (నెరుసులు) ఏ ప్రకారముగా పుట్టినవో అట్లే బ్రహ్మమందు బ్రహ్మాండములు పుట్టినవి అని కొందరంటారు.

గు : అట్లాగునా అనకూడదు. అగ్నికి కట్టెలు, పిడకలు వగయిరా పృథ్వీ సంబంధమగు పదార్థములు ఆధారమై నున్నందున మిణుగురులు పుట్టినవికాని వూరకే పుట్టలేదు.

శి : మరికొందరు పేడయందు పురుగులు ఏలాగున పుట్టెనో ఆలాగుననే బ్రహ్మమందు విశ్వము పుట్టెనని అన్నారు.

గు : బ్రహ్మము పేడవంటిది కాదు. పేడయందు పంచభూతములు కలిసియుండుటచేత పుట్టినవి. పేడమీద సూర్య కిరణములు ప్రసరించి, ఆపైన వాయువు సోకితే, పైన యెండి లోపల చెమ్మగావుండి పురుగులు పుట్టినవి. కనుక ఆ దృష్టాంతం పనికిరాదు.

శి : అగ్నికంటె, అగ్ని శక్తి యేలాగున భిన్నమో ఆలాగుననే బ్రహ్మముకంటె మాయ భిన్నమని, జగత్తు మాయా కార్యమని అన్నారు.

గు: అగ్నికంటె అగ్ని శక్తి ఏలాగు భిన్నం? భిన్నమైతే అగ్ని ఒకచోట దాని శక్తి మరొకచోట కానరావలెను. ఒకదాని విడచి మరొకటి లేదే!

శి: గారడీవాడు అగ్ని స్తంభన చేసినపుడు అగ్ని కానవచ్చిననూ, కాల్చలేకపోయినట్లుగా అగ్ని శక్తి భిన్నమన్నారు.



గు: ఈ దృష్టాంతము పనికిరాదు. అగ్ని సాకారము దానియందు గుణము వుండుట చేత దానికి యేలాగున చెప్పినా తప్పు లేను. అనుపమానమైన బ్రహ్మమందు గుణరూపములు లేవుగదా! కనుక అట్టి పరిపూర్ణ బ్రహ్మమందు శక్తి వున్నదనే చెప్పరాదు.



శి: ఎందుచేత?



గు: పిపీలికాది బ్రహ్మపర్యంతము శక్తి వున్నందు చేతనే జనన మరణములు కలుగుచున్నవి బ్రహ్మమందు కూడా శక్తి వుంటే, బ్రహ్మమునకు కూడా జననమరణములు చెప్పవలసివచ్చును. కనుక అట్లు చెప్పరాదు. గురుకృపా పాత్రులుగానిచో, శాస్త్రభాష్యాదులెన్ని చదివినా ఆయా గ్రంథములచే వాదించుకొనుటకేగాని మరేమీ లేదు. అహంకారంతో గూడుకొని, అభ్యాసమును విడచి, అంతుచిక్కక, సద్గురుబోధ బడయక వుండేవారికి ఈ మర్మము తెలిసికొనుట చాలా దుస్తరము. తాను లేకపోయే మార్గము తెలిసినవాడు, రాకడా పోకడా తెలిసి సర్వకాలము లేక వుంటాడు. దేహములేని సాంప్రదాయము గుర్తెరుగవలె.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## నాలుగవ ప్రకరణము

## అధ్యారోపాపవాదములు-పరిపూర్ణము

గు : పరిపూర్ణ పరబ్రహ్మమందు గురుతే లేదు.

శి : మరి ఆ పరిపూర్ణ బ్రహ్మానుభవము ఎట్లు కలుగగలదు స్వామీ?

గు : పరిపూర్ణమందు బ్రహ్మానుభవమే లేదు. అనుభవాపేక్షారహితమే, అనుభవము. దీనితో భాష్యాదులు వార్తికాదులైనా పనికిరావు. గురుసూచన ద్వారా గురుతే పోవును. నిరతిశయమై నిర్వ్యాహ్యమై నిలచును. కాబట్టి అధ్యారోప అపవాదములే అక్కర్లేదు.

శి : అధ్యారోపమనగా నేమి? కొన్ని దృష్టాంతములతో సెలవీయండి?

గు : అధ్యారోపమనగా లేనిదానిని ఆరోపించుట.
ఉదాహరణములు : (1) రంగమందు రజితాధ్యారోపము (తగరమును చూచి వెండి అనుకొనుట) (2) ఆరకూటమందు హేమాధ్యారోపము (ఇత్తడిని చూచి బంగారమనుకొనుట) (3) గాజుయందు రత్నాధ్యారోపము (4) మణియందు జ్యోతిర్ భ్రాంతి (5)

పిష్టోదకమందు క్షీరభ్రాంతి (పిండి నీళ్ళను చూచి పాలనుకొనుట) (6) అంబరమందు నీల, పీతాదిభ్రాంతి (అనగా ఆకాశమునకు నిజముగా లేని నీలాదివర్ణములు ఉన్నవనుకొనుట.)

శి: అపవాదమనగా నేమి?

గు: ఉన్నట్లు తోచబడినది నిజముగా లేనే లేదని నిరూపించుటయే అపవాదము.

శి: అటువంటి అధ్యారోప అపవాదములు ఎందుచేత వచ్చినవి?

గు: అధిష్ఠాన జ్ఞానముచేత వచ్చెను. అధిష్టాన జ్ఞానము ఉండబట్టి అన్నీ తోస్తూ ఉండును. ఆ చైతన్యము మాయయని ఎంతవారికిని తెలియదు.

శి: మరి ఈ అధ్యారోపము మాయయందే తోచవలయును కాని బ్రహ్మమునందు తోచకూడదు కదా?

గు: అవును. మాయాబ్రహ్మమైన సచ్చిదానంద స్వరూపమునందే కాని పరిపూర్ణమందు తోచదు.

శి: ఎందుచేతనో వివరించండి స్వామీ?

గు: (1) పరిపూర్ణము అపదార్థము కనుక పదార్థస్వరూపమైన జీవబ్రహ్మ జగత్తులు తోచనే తోచవు. రంగమందే రజితము తోచెనుగాని ఆ సత్తావిహీనమైన దారువు మొదలైన వానియందు తోచలేదు. అట్లే రజ్జువుయందు సర్పాధ్యారోపశక్తి ఉండబట్టి సర్పము తోచెను. లేకుంటే కుడ్యమునులాదులయందు (గోడ,

గాది మొదలగు వానియందు తోచరాదా?) భూమి సర్వవ్యాప్తమైనా ఘటశక్తి ఒకానొక స్థలమందు మాత్రమే ఏలాగున ఉన్నదో ఆలాగే. (2) అదే గాకుండా అధ్యారోపము బ్రహ్మకే తోచెనా? అన్యులకు తోచెనా? జగదభావమందు అన్యులు లేరు కనుక అన్యులకు తోచదు. పరిపూర్ణమందు జ్ఞానాజ్ఞానములు లేవు కనుక దానికిన్ని తోచదు. మరి ఎవరికితోచెను. (3) పూర్వమందు సర్పమును చూస్తేగదా ఆ స్మరణ అంతఃకరణమందు నిలిచి రజ్జువునందు స్ఫురించును? మునుపు జగత్తును ఎవరు చూచిరి? (4) నిర్జగత్తయినపుడు ఏలాగు ఎవరికి తోచెను. తోచుటకు వీరెక్కడ ఉండిరి?

శి : అధ్యారోపము చేసేది, భ్రాంతి రూప వస్తువులను చూచేది ఏది?

గు : ఎరుకే చూచేది? ఎరుకే చేసేది?

శి : సత్యాసత్యములు నిర్ణయించేది మరొక జ్ఞానమేమైన కలదా?

గు : వాచిలీగవలె దీనికి మూలము లేదు. తనయందు కల్పించిన్ని! నాకంటె అన్యము అనేది ఇదే! నేను సత్యము జగత్తు మిథ్యనేది ఇదే! జగత్తూ నేనూ సత్యమని చెప్పేది ఇదే! ఇటువంటి దానియందే అధ్యారోపము కాని పరిపూర్ణమందు అధ్యారోపము లేదు, అపవాదమూ లేదు.

శి : లేని సత్యజ్ఞానానందమైన ఎరుక ఏలాగున వచ్చెను? ఏలాగున జగత్తు చేసెను? ఏలాగున లేకపోవును?

గు : వేదాంత శాస్త్రమందు షట్ కారణములు చెప్పినారు. అవిగాక మరి రెండు కారణములున్ను చెప్పినారు. అవి అబద్ధమని ఎరుకయుండే అంగీకరించలేదు.

శి : ఆ కారణము లేవియో చెప్పి అవి ఏల అంగీకరించరాదో చెప్పండి స్వామీ?

గు : ఒకటి సమవాయి కారణము. అనగా మృత్తు ఘటమైనట్లు చెప్పుట సమవాయికారణము. కాని ఎరుక పరిపూర్ణము కాలేదు. పరిపూర్ణమున కెరుకయున్నూ లేదు. కనుక మృత్తు తంతువులు ఘటపటాదులు అయిట్లుగ పరిపూర్ణము ఎరుకజగములు కాలేదు. (2) అసమవాయి కారణము :- అసమవాయి కారణమనగా. కారణ కార్యములలో కారణ లక్షణములు కార్యమునందును, కార్యలక్షణములు కారణమందును గానరాకపోవుట.

పరిపూర్ణము అన్యమునకు కారణం కాలేదు మరిన్ని పరిపూర్ణము స్వతహాగా శక్తిహీనముగుటచేతను రూపరహితమగుట చేతనూ పరిపూర్ణము ఎరుకకు కారణమని చెప్పరాదు.

(3) నిమిత్త కారణము : కుమ్మరి నిమిత్త కారణము, పరిపూర్ణమునకు కర్తృత్వమున్నూ, అంగములున్నూ లేవు కనుక ఎరుకోత్పత్తికి పరిపూర్ణము నిమిత్తము కాజాలదు.

(4) సంయోగ కారణము : అనగా రెండు వస్తువుల కలయికలో మరొక వస్తువు కలుగుట సంయోగ కారణము.

అయితే పరిపూర్ణము కంటే అన్యమేలేదు. కనుక ఎరుకో త్పత్తికి సంయోగ కారణమున్నూ వర్తించదు.

(5) అనుబంధకారణము : అనగా గోమయమునందు కీటకములు జన్మించుట, సూర్యకాంతిచేత సూర్యకాంత మణి యందు అగ్ని ఉత్పత్తియగుట ఇవి అనుబంధ కారణములు. తనకంటె ఇతరమేలేదు? కనుక అనుబంధ కారణముకాదు.

(6) స్వకారణము : అనగా తనంతట తానే కార్య కారణ రూపముగా బీజవృక్షములవలె ఉత్పత్తి యగుట, కాని పరిపూర్ణమందన్యముగాని స్వగత భేదముగాని లేనందుననున్నా పరిపూర్ణమునకు జగత్తునకు ఏలాటి సంబంధము లేదు కనుకనున్నూ, స్వకారణమనుట అసలేకూడదు.

(7) సోపాధికకారణము : అనగా అన్నిటికి ప్రారబ్ధమే మూలకారణము కనుక అది సోపాధికకారణమని చెప్పబడును పరిపూర్ణమునందు కర్మత్రయమూ లేనేలేదు. కనుక సోపాధిక కారణమూ కాదు.

(8) నిరుపాధికకారణము అనగా పరమాణువు. కాని ములు గుచ్చు సంధిలేనిదై ఆదిమధ్యాంతములు లేనిదానియందు పరమాణువున్నూ వుండజాలదు. కనుక అత్యంత విలక్షణమైన పరిపూర్ణ మష్టవిధ కారణములలో యే కారణమున్నూ కాదు.

శి : ఎరుకలేనిది కనుక దానిని కూడా యేకారణమనీ అనరాదు కదా? మరియెట్లు?

గు : బోధ నిమిత్తమై వంధ్యాసూనుని సంతతివలె యెరుక యందారోపించవచ్చును. ఎరుకే అన్నికారణములు అవును.

శి : పరిపూర్ణమును యిక ఏమని వర్ణింపవలె స్వామీ!

గు : స్వతస్సిద్ధమైన పరిపూర్ణమును ఏమీ అనరాదు. అది అగోచరము నిరామయము. అందన్యమెంతమాత్రము లేదు.

శి : మరి జగత్తు సంగతి ఏమి?

గు : పుట్టని దానియందు పుట్టే జగత్తు లేదు. ఆత్మ అనగా లేనియెరుక. అదే లేదు గనుక రెండు లేనేలేవు. కనుక నాలుగు మహావాక్యములున్న, షోడశ మహావాక్యములున్న, జహల్లక్షణ, అజహల్లక్షణ, జహాద జహాల్లణ, తటస్థలక్షణ, స్వరూపలక్షణ, అతద్వ్యావృత్తిలక్షణ, సన్న్యస్తలక్షణ, యీ మొదలైన పంచవింశతి లక్షణములున్ను పనికిరావు. పరిపూర్ణము విలక్షణము, లక్ష్యాతీతము పురుష ప్రకృతి రహితము గనుక ప్రకృతి పురుష ప్రతిపాదకమైనవి ఏమీ పనికిరావు అసంభావన విపరీత భావనలు కూడదు.

శి : పరిపూర్ణమసలు భావమా? అభావమా?

గు : భావముండే అభావము; అభావముండే భావముగలవు. ఈ రెండూ కానిదే పరిపూర్ణము. ఘటాభావమునకు ప్రతియోగికము ఘటము ఏలాగో, ఆలాగే భావనిష్టమందు అభావమున్ను, అభావనిష్టమునందు భావనిష్టమున్ను వున్నవి భావముండబట్టి అభావము పుట్టినది. దేని యభావము దానియందు బుట్టును. భావారహితమైన పరిపూర్ణము ఏమీ కాదు.

శి : అవును; అసలు ఆత్మయే లేనిచో అనాత్మభావము నుండదు గదా!

గు : ఆత్మానాత్మ రహితమైనదే పరిపూర్ణము. అది అగోచరము. అది ద్రష్టకాదు. దృక్కుగాదు. దృశ్యము కాదు. ఈ మూడూ ఒక్కటే. ఒకటి పోతే ఒకటి వుండదు.

శి : అది సరేగాని ఆ ఒకటి పోయేదెట్లు?

గు : అది పోయ్యేకొరకే గురుకులవాసము.

శి : మరి ఒక మార్గమే లేదా?

గు : అది పోయ్యేరీతి గుర్తెరుగక తత్సంబంధమైనవి ఎన్ని యెరిగినా నిరర్థకమే. పుండు ఒకచోటనుండగా ఔషధము మరియొకచోట పెడితే మానునా? ఎరుకపొయ్యే కొరకు, దాని మూలం దానికి తెలిస్తేనేగాని పోదు. ఈ బోధచేత నుండదు.

శి : అందుకు జీవ బ్రహ్మైక్య జ్ఞానము చాలదా?

గు : ఎంత వుడుకులైనా వేడినీళ్ళచేత యిల్లు కాలునా? అటువలెనే ఎన్ని బోధలైనా అజ్ఞానం మాత్రమైనా పోగొట్టవు జీవబ్రహ్మైక్య జ్ఞానమునందు మాయ బలిష్టమైయుండును గాని నిర్మూలముగాదు సరిగదా పాదై యుండును. జలమువలన వృక్షము నశించనట్లే యితర మార్గములచే ఎరుక నశించదు.

శి : యీ మార్గంలోని ప్రత్యేకత ఏమి?

గు : ఎన్ని మార్గములైనా ఈ పరిపూర్ణ మార్గముతో

సమానము కాదు. దీనిని (ఎరుకను) శోధించి, భేదించి విచారించి గురువుల వలన దీనిని వదిలే వుపాయం వెరుకవలెను. ఒకటి (యీ ఎరుకొక్కటి) వుంటే రెండోది వెనుకనే వుండును.

శి : ఇది ఏలాగున నశిస్తుంది?

గు : మిథ్యాత్మ నిశ్చయమే నశించడము. కుక్కేది నల్లి కొట్టిన మంచమన్నట్లు కాకూడదు. గురువాక్యరీత్యా ఎరుక నేరణము మాయమయ్యేవుపాయ మేచేయవలెను.

శి : ఎరుకనగా యెటువంటిది.

గు : ఎరుక మరుపులు. చీకటి వెల్తురులు. చింతించి ఎ౦గే దే ఎరుక. స్వప్రకాశమైనదే ఎరుక. జగత్సాక్షి అయినదే యెరుక. త్రిపురస్తమై త్రిపుగ మితమై, ద్రష్ట దృక్కు దృశ్యమైనదే యెరుక. అదే శుద్ధమాయ.

శి : జీవోహం అను భ్రాంతి వదలిన చాలదా?

గు : జీవోహం భ్రాంతి యినుప సంకెళ్ళు; శివోహం భ్రాంతి బంగారు సంకెళ్ళు; సువర్ణపు సంకెళ్ళు వదలవు. అదే బ్రహ్మమని శృతిస్మృతి పురాణములు చెప్పుచున్నవి.

శి : గురువు ఆ సంకెళ్ళనుండి విడిపించగలడా?

గు : గురువెంతటివాడో శిష్యులంతటివారే అవుతారు. ఉపనయనముకానిది వేదము చదువుకొంటే ఏలాగు బ్రాహ్మణుడుగాడో, ఆలాగే బయలు బయలన్న మాత్రంచేత ఆ మార్గం యెరిగినవాడు కాడు. వాడు వుభయభ్రష్టుడగును.

శి : యెందుచేత?

గు : మర్మములు తెలియవు. ఈ మార్గం సమర్మకంగా గురుముఖంగా తెలియకుంటే వ్యర్థము. శూన్యవాదియై బౌద్ధత్వము వచ్చును. పులిని చూచి నక్క వాతపెట్టుకొంటే పురుగులుపడి చచ్చినట్లు; ఈత రానివాడు బావిలోపడ్డ చందము.

శి : బాగా నేర్చిన పండితులు గూడ గురువును చేరవలెనా?

గు : బసవేశ్వరునికెంత తెలిసినా ప్రభువు దగ్గర బోధ తెలిసినట్లు; ఈ మార్గము కొంచెము శ్రీకృష్ణునికి తెలిసినా, సాందీపుని వద్దకు పోయి తెలసుకొన్న చందము అంతర్బహిస్సులు బయలైనా గురుముఖంగా తెలియవలెను. లేకుంటే మెరుక వదలదు. మెరుక బోధ మెరిగినా పోదు; మెరుగకున్నా పోదు.

శి : మరెట్లు స్వామీ!

గు : ఈ బోధ యేమీ మెరుగని మూఢునకు చెప్పినా భక్తిస్థిరమై యుండును. అచలస్థితి కుదురును. లేకుంటే సమస్త మార్గములు విసిగివచ్చిన వానికి, భక్తి స్థిరం గలవానికి, చెప్పితే కుదురును. లేకుంటేవాగ్వ్యాపారమై చెడిపోవును. భ్రాంతి తీరనిది బోధ చెప్పకూడదు.

శి : భ్రాంతి యెట్లు తీరును?

గు : ఈశ్వరానుగ్రహం (గురుకృప) లేక సిద్ధించదు. కనుక శీఘ్రంగా గురుకృప సాధించవలెను. అట్టి వానికి గురువాక్యముచేత మెరుకపోవును.

శి : ఏ విధంగా పోవును?

గు : ఔషధముచేత వ్యాధి హరించినట్టున్నూ, క్షుత్పిపాసాదు

లన్నపానాదులవల్ల హరించినట్లు, ద్రవ్యార్జనచే దరిద్రము పోయినట్లు, త్యాగమువల్ల లుబ్ధత్వము పోయినట్లు, గురువాక్యముచేత ఎరుకపోవును.

శి : ఎరుక వదలి, వదలినవా నిచిహ్న మెట్టిది?

గు : సహగమనము చేసినదానికి దేహాభిమానము వుండనట్లే రతి సమయమునందు పతియొద్ద సిగ్గుండనట్లే, ప్రాణావసాన సమయమందు మహాత్ములకు సంసార భ్రాంతి పుట్టనట్టు, గురుమూర్తి సన్నిధిని అభిమానము, లోభము నుండవు ఆలాయుంచితే గురుపుత్రుడుగాడు.

శి : వుంటే ఏమి?

గు : అతని కేలాగున (ఎరుక) పోవును? అతని బ్రతు కేలాగంటే పాద్దుపోయిన సనుక వడికి, వుడుకు పొయ్యిలో బెట్టిన సామ్యమౌను. అటువంటి భ్రాంతికలవానికి బోధ చెపితే ఓటికుండలో నీళ్ళుపోసినట్టవును.

శి : సరే. ఈ బోధ యొక్క ఆధిక్యత యేమి?

గు : ఈ బోధచేతగాని భ్రాంతి వదలదు. ఎన్ని యోగములు జ్ఞానములు సంపాదించినా భక్తిలేని పూజ పాడగును. పుట్టమీద కొడితే భుజగము చావనట్లే, చెరకు పానకముచేత వేపచెట్టుకు తీపిరానట్లే, ఈబోధ బడయకుంటే సకల యత్నములు వ్యర్థము.

శి : ఎరుకకూ మాయకూ తేడాయేమి?

గు : ఎరుకన్నా మాయయన్నా ఒక్కటే సర్వదేహములందూ భిన్నభిన్నముగా గానవస్తూయుండును. దర్పణనిర్మిత మందిరాభ్యంతర మర్కటవత్ (అద్దాల గది

లోని కోతివలె.) ఒక్కటై యుండును, అనేకంగా దోచి భ్రాంతిని పొందించును?

శి : యెందువలన?

గు : వున్నది వున్నట్లు తెలియుపోవుటవలన, సమస్తము తానే కాని విచారించగా తానేలేదు.

శి : లేనిది యెట్లు తోచును?

గు : ఎండమావులయందు జలం తోచినట్లు విచారణమీద ఏమీ లేదు.

శి : అని తెలిసి యేమి చేయువలెను?

గు : పుట్టని బట్టబయలు తెలియువలెను. అప్పుడు ఒక్కటీ యుండదు. అపుడు అచలమూ, అనంతమునైన పరిపూర్ణము తప్ప రెండోదిలేదు. ఒకటీ అదికాదు; ప్రపంచ మెన్నడూ పుట్టనేలేదు. మాయా, పురుషులు గురుశిష్యులు, క్షేత్రక్షేత్రజ్ఞులు, విద్యావిద్యలు, చిజ్జడాలు, అధ్యారోప అపవాదములు, భావాభావములు ఆత్మానాత్మలు, జీవేశ్వరులు, ఏ ద్వంద్వములూ లేవు.

శి : వున్నట్లు తోచుచున్నవే!

గు : సూర్యునియందు చీకటున్నట్లున్నూ, ఆరకూటముపురుగు దొలిచినట్లున్నూ అన్న దే లేకుంటే, వున్నదంటే వుంటుందా? యెక్కడా లేదు? ద్రష్టలేదు. గనుక దృశ్యమేలేదు. యేమీలేదు గనుక, లేదన్న విచారమూ లేదు. ఉన్నాకన్నా యేమీలేదు. లేని ఆపదలచేత, యెండమావుల చెర్వులోబడి తామునిగినట్టే, నీరుద్రావి ప్రాణము విడిచినట్టే, యేమిచేసినా నిర్భయము.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ఐ ద వ ప్ర క ర ణ ము

## ఉపాదాన కారణములు

గు : పరిపూర్ణ పరబ్రహ్మమునందేమియు పుట్టలేదు.

శి : మరి యెరుక యేలాగున పుట్టింది? ఏలాగు నశిస్తుంది?

గు : సర్వమునకు కారణమైన సచ్చిదానంద స్వరూపమైన జ్ఞాన స్వరూపమే ఎరుక. అది యెట్లు కల్గెనంటే. శాస్త్రములో షడ్విధోపాదాన కారణములు చెప్పబడినవి.

శి : అవి ఏమి?

గు : (1) వ్యావర్తో (వివర్తో) పాదానము (2) సంవర్తోపాదానము (3) అణూపాదానము (4) సన్యస్తోపాదానము (5) అణుపాదోపాదానము (6) అజాతోపాదానము.

శి : వీనికి దృష్టాంతములు సెలవియ్యండి స్వామీ.

గు : వ్యావర్తోపాదానమునకు దృష్టాంతము వృక్షమునందు, వృక్షమున కన్యంగా, బదనిక వుత్పత్తి అయిన విధంగా యెరుక వుత్పత్తి అయినది, అని అన్నారు.

శి : సంవర్తోపాదాన మనగా నేమి? అందుకు దృష్టాంత మేది?

గు : మొదలు లేకుండా తోచడమే సంవర్తోపాదానము. పాచితీగె, అంతరతామరల రీతిగా మొదలు లేకుండానే తోచుట.

శి : అణూపాదాన మనగానేమి?

గు : అణుక, ద్వ్యాణుక, త్ర్యాణుక, పరమాణువులు స్వతంత్రముగానే తోంచి, స్వతంత్రముగానే, ఎట్లు లేకుండా పోవుచున్నవో, అట్లేఎరుకకూడా మూలము లేకుండానే పుట్టి, మూలము లేకుండానే ప్రవర్తించి, మూలము లేకుండా పోవుచున్నట్లు గుర్తించుట.

శి : అణుక, ద్వ్యాణుక, త్ర్యాణుకము లనగానేమి?

గు : ఒకటి, రెండు, మూడు, పరమాణువులు చేరిన వస్తువు అని అర్థం గ్రహించవలెను.

శి : సన్న్యస్తోపాదాన మనగానేమి?

గు : అప్పుడే తోంచి, అప్పుడే వృద్ధిపొంది, అప్పటికప్పుడే లేకపోవుట సన్న్యస్తోపాదానమని చెప్పబడును. ఇందుకు స్వప్నమే దృష్టాంతము. గజ, తురంగ, నర, పశు, పక్ష్యాదులు, స్వప్నంలో అప్పటికప్పుడే తోంచి, వృద్ధి బొంది, మేలుకొనగా ఏమీ లేనట్లున్న, మేఘము నందు రక్త నీలాది వర్ణములు, అప్పటికప్పుడే కాన వచ్చి అప్పుడే లేనట్లున్న, మరిన్ని జలబుద్బుదములు వలె (నీటి బుడుగలు) లేక మెరపు రీతిగా క్షణంలో పొయ్యేవి, అని గుర్తెరుగవలెను.

శి : అణుపాదోదాన మనగానేమి?

గు : అదితప్ప రెండవది లేదు. కనుక ఇంకొక విధంగా వుపాధి లేకుండా సర్వము తానే అయినదన్న భావము. "సర్వము" అనేది తీసి చూస్తే సరి. ఇందుకు దృష్టాంతముగా కొందరు కనకము భూషణములైనట్లు, తంతు

వులు పటమైనట్లు (అనగా నూలుదారములే వస్త్రము
లైనట్లు) సర్వము యెరుకే అయివున్నదన్నారు.
యిందుకు శ్రుతి: చిన్మాత్రం బ్రహ్మవిష్ణ్వాద్యాః
చిన్మాత్రం సర్వదేవతాః। చిన్మాత్రం త్రిషులోకాశ్చ
గురుశిష్యాది చిన్మయా॥ కనుక అట్టి యెరుకే వున్న
వస్తువనిన్నీ, దానియందు సర్వము లేకతోచెననిన్ని
చెప్పుట.

శి: అజాతోపాదానమనగానేమి?

గు: ఎరుక పుట్టనేలేదనే వాదన. ఇందుకు దృష్టాంతము
లేవనగా— ఖపుష్పవతు, వంధ్యాపుత్రవత్ శశశృంగ
వత్ (అనగా ఆకాశమునందు పుష్పము, గొడ్రాలికి
బిడ్డ, కుందేటికి కొమ్ము అనేవి లేకపోయినను ఆ
మాటలు మాత్రము వున్నట్లుగానే) ఎరుక అనే మాట
మాత్రమే వున్నదిగాని, వస్తువులేదనుట. అంటే, తెలి
సేది, తెలియబడేది రెండూ కూడా, యేమీలేవు అన్న
మాట. కనుక తోచనేలేదు.

శి: లేదంటే—తోచిలేదనెనా? తోచకనే లేదనెనా?

గు: తోస్తే లేదనేయనడు. తోచకుంటే, అననే అక్కర
లేదు. కనుక, "తోచలేదు; తోచకపోనూలేదు. నేను
లేను, కనుక యేమీలేదు" అనాలియిలాఅన్నా-యివన్నీ
కూడా తేనిదాని మాటలే అదే కాకుండా "అయం
వ్యర్థః బాహ్యోపి నభవతి" అనే గురు వాక్యంచేత
తెలియక తెలియవలెను.

శి: అది యెట్లు?

గ్రహముచే చెప్పనిదే యీ బోధస్థితి కుదరదు.

శి : స్వాప్నమందూ అనుగ్రహించుట అనగా ఏమి?

గు : తాబేటి తీరు పురలె, గురువు భావనారూపంగా శిష్యుని యొక్క అభివృద్ధి కోరితే చాలునన్నమాట.

శి : మిథ్యాస్వరూపమైన ఎరుకకు చలనము. లేక గమనము వున్నదా లేదా! వుంటే ఆ చలనము ఏ రూపంగా నున్నది?

గు : ఎరుకయే సర్వమునకు చలనసత్తా యిస్తున్నది. దాని యందా చాలనశక్తి వుండుటచేతనే దానివలన కల్గిన సమస్తమునకు చలనము కలుగుచున్నది. కారణము నందు బీజరూపంగానైనా లేని గుణము, కార్యమునందు రాజాలదుగదా! ఒకప్పుడు చలన రూపంగా, మరొక ప్పుడు అచలరూపంగా. గానవస్తూ యెరుక చలాచల ద్వంద్వస్వరూపంగావున్నది. ఎప్పుడూ ఏ చలనమూ లేనిదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే.

శి : పరిపూర్ణము అసలే చలించకుండుటకు కారణమేమి?

గు : అది చలించవలెనంటే, అందుక్కావు (స్థలము, అవ కాశము' లేక కాళీప్రదేశము) ఎక్కడనున్నది? సూది మోపుటకైనా సందులేకుండా, అంతటా ఆ పరిపూర్ణ పరబ్రహ్మమే నిండియున్నదికదా?

శి : ఎరుక కూడా సర్వవ్యాపకమేనంటున్నారే!

గు : అంతటా వుంటే ఎట్లా చలించగలదు? సర్వవ్యాపకమే అయి వుంటే చలించనేకూడదు. కాని దాని చలనము ప్రత్యక్షమేగదా!

శి: దాని చలనం ప్రత్యక్షంగా యెట్లున్నది?

గు: సృష్టికాముని, (యిచ్ఛ. లేక సంకల్పము) మానసిక, (లేక భావనారూప) చలనమనడానికి యెందుకు భయపడతావు? అంతట నింతట కనపడునంతటిదేగాని, ఎరుక అంతట గలదా?

శి: అంతట లేదనడానికి యింకా, ఏమైన యుక్తులు తెలపండి స్వామీ!

గు: వ్యష్టియందు చూస్తావంటే—గుర్తింగే జ్ఞానం దేనియందు లగ్నమైతే అదే తెలియవస్తుందిగాని, అన్యదేశమునందున్న విషయ గ్రహణం అగుట లేదుగదా! పోనీ సమష్టియందు చూతామంటే పరిపూర్ణమే అంతటానిండివుందంటే యింక ఎరుకకు స్థానమెక్కడ?

శి: ఐతే, యెరుక అణుస్వరూపమనియా మీ వాదన?

గు: అణువూ కాదు, విభువూ కాదు.

శి: మరేమిటి స్వామీ!

గు: అణువూ అగును, విభువూ అగును.

శి: చిత్రంగావుందే! పోనీ అణుప్రమాణం మధ్యప్రమాణం మహత్ప్రమాణాలలో అణువు. మహత్తు కాదంటే, యిక మధ్యప్రమాణమా? నన్ను చంపక ఎరుక ఎంతటిదో తెలివియ్యండి?

గు: అన్ని ప్రమాణాలూ దానివే. కాని ప్రత్యేకం ఏ ప్రమాణమూ కాదు. అది యెంతటిదంటే, ఎంతలో వుంటే అంతటిది అనగా ఉపాధినిబట్టి చీమలోవుంటే చీమంత, ఏనుగులోవుంటే ఏనుగంత.

శి : జగత్తు లేకుండా ఎప్పుడైనవుండునా?

గు : జ్ఞానము లేకుంటే జగత్తు లేదు. వస్తువులేకుంటే బింబ్యం లేనట్లుగానే దీపం లేకుంటే దీపప్రకాశముండునా?

శి : పరిపూర్ణ పరబ్రహ్మజ్ఞానము సంపాదించుకుంటే చాలునా?

గు : గురుకృపాప్రసాదము లేకుంటే ఎన్నివున్నా, అన్నీ వ్యర్థమే. గురుకృపా సంసిద్ధియుంటే, ఏమిలేకపోయినా ఏ బాధాలేదు.

శి : ఎందుచేత?

గు : నిప్పు దగ్గరకుపోతే చలివుండనట్లు, సూర్యుడువస్తే మంచు విడిపోయినట్లు గురువాక్యం వుంటే ఎరుక వుండదు.

శి : ఒకవేళ గురువాక్యం వినకుంటే వానిగతిఏమి?

గు : పిసినికాయలోని పురుగు, అంతా అల్లుకొని దాని లోనే చిక్కబడిపోయి చచ్చినట్లు, యీ బోధ గురు ముఖంగా విచారించకుంటే వాడంతటవాడే మునిగి పోవును. కంబళిగలవానికి చలిబాధ లేనట్లుగానే ఈ బోధ వుంటే ఏ బాధాలేదు.

శి : ఎట్లా లేకుండాపోతాయి బాధలన్నీ?

గు : తానులేడు కనుక ఏ భయమూలేదు. కొండమీద సూదులు గుచ్చితే (కొండకే బాధా ఎట్లావుండదో) ఏలాగో. ఆలాగే యీ మార్గమందున్నవానికి యెరుక నంన ఏ భయమూలేదు

శి : ఏ సాధనచే పరిపూర్ణ సాక్షాత్కారము చేకూరును?

గు: ఏ సాధనయు నక్కరలేదు కానవచ్చే చిత్రమునకు గట్టెక్కి చూడవలెనా? పరిపూర్ణమును చూడబోయి ఎరుకతానే లేకుండాపోవును. స్వతస్సిద్ధమై అనవచ్చిన్నమైన పరిపూర్ణమును సూచనచేస్తే, కలలో మేల్కొంటే ఎలాగో అలాగే.

శి: ఇక గురూపాసన యెందుకు?

గు: కుక్క యెంత బలిసినా గోనెబస్తాలు ఏలాగునమోయు లేదో, ఆలాగే, గురుభక్తి విహీనునకి మాత్రం యీ బోధ చిక్కదు.

శి: సరే. కాని, మీరు చెప్పిన షడుపాదానములున్ను ఎరుకపట్ల యెట్లు అన్వయించును?

గు: ఎరుక (1) మధ్యనేతోచి మధ్యనేపోతున్నది కనుక వ్యావర్తోపాదానము (2) సత్యత్వము లేదుగనుక సంవర్తోపాదానము (3) మూలములేని చెట్లు ఏపండ్లూ ఫలించవు గనుక అణుపాదానము (4) సమస్తము తనతోనేపోవును గనుక సన్యస్తోపాదానము (5) ఉపాధియుండేకాని ఉపాధిని విడచి లేదు కనుక అణుపాదోపాదానము (6) పుట్టనేలేదు కనుక పోనేపోదు, కనుక అజాతోపాదానము. యీ విధంగా షడుపాదానములు యెరుక యందన్వయమగుచున్నవి.

శి: జై! సద్గురుప్రభు మహారాజకూ జై!!!



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ఆ ర వ ప్ర క ర ణ ము

## జీవేశ్వర కూటస్థ బ్రహ్మ విచారము

శి : జీవేశ్వరులు ఏలాగైనారో సెలవీయండి స్వామీ?

గు : శాస్త్రకారులేమన్నారంటే—అంతఃకరణము, అంతఃకరణాధిష్ఠాన చైతన్యము, అంతఃకరణ ప్రతిబింబ చైతన్యము, ఈ మూడూ గూడి జీవుడాయెనన్నారు.

శి : ప్రతిఫలిత చైతన్యమనగానేమి? ప్రతిబింబమునకు చైతన్యముండునా?

గు : అంతఃకరణమందు ప్రతిఫలించిన చైతన్యమనేభావము మాత్రమే. యిదే ప్రతిబింబమతము [వాదము]

శి : యితరవాదములవారేమంటారు?

గు : అంతఃకరణ ప్రతిబింబ చైతన్యము చెప్పుట యుత్తమముకాదని అవిచ్ఛిన్నవాదము బయలుదేరినది.

శి . ఎందుకుత్తమముగాదు?

గు : ప్రతిబింబమునకు సుఖదుఃఖములుండవు కనుక.

శి : వీరివాదమేమి?

గు : చైతన్యమునకు పరిచ్ఛిన్నము కూడదు. కనుక అంతఃకరణావిచ్ఛిన్న చైతన్యము చెప్పవలెనన్నారు.

శి : యింకాయేమైన వాదములున్నవా?

గు : యోగమతమువారేమన్నారంటే; జీవరూపేణా వాడే చేస్తున్నాడు, వానివల్లనేపుట్టినది, వానియిచ్ఛవలననే అవుతున్నది అన్నారు. భక్తులు కర్తా భోక్తా రెండూ వాడేనంటారు పైగా తాముచేసిన సత్కర్మఫలము కూడా వానికే చెందునంటారు. యివన్నియు మాయా స్వరూపమైన యెరుకయే. ఈ యెరుక నణచినవాడే వుత్తముడు.

శి : యిందేది గ్రహించవలెను? ఏది సత్యం?

గు : ఏమిన్ని కాదు.

శి : ప్రతిబింబవాదమెందుకు పనికిరాదు?

గు : అంతఃకరణకుజీవత్వం చెపితే ముకురము [అద్దము] నకు, జలమునకూ, జీవత్వ మెందుకు చెప్పరాదు? అంతఃకరణమువలెనే ముకురజలములు రెండూ నిర్మలములే. యీ రెంటివలెనే అంతకరణమూ జడమేకదా?

శి : అంతఃకరణము వాని వంటిదికాదు. యిది అంతఃపదార్థముకదా? కనుక జీవత్వము ఎందుకు చెప్పరాదు?

గు : అంతఃపదార్థం కనుక చెప్పవచ్చునంటే, మేధోరుధిర మాంసాదులకెందుకు చెప్పకూడదు? అన్నిటికంటె అవిద్యఅనాది. దానికిన్ని జీవత్వం చెప్పవచ్చును. ఇంతే కాకుండా జీవునిచేత అంతఃకరణము తెలియబడుచున్నది. కనుక అంతఃకరణముకంటెజీవుడు భిన్నుడు కావలసియున్నదిగదా!

శి : పోనీ, అంతకరణ ప్రతిబింబానకు జీవత్వం చెప్పచ్చునేమో?

గు : (2) బింబవికారమే ప్రతిబింబము కాని ప్రతిబింబమునకు స్వతహా అన్యవికారములుగాని సామర్థ్య వ్యవహారములుగాని లేవు. స్థావరజంగమముల ప్రతిబింబములకు ఏమైననున్నవా? నీవు ప్రతిబింబము కొరకు, అంతఃకరణ మంగీకరించితివే? అంతఃకరణ లేకుండా ప్రతిబింబితుడైన జీవుడెక్కడనుండివచ్చును? కనుక ప్రతిబింబమునకొక్కదానికి ఏ పక్షంలోనూ జీవత్వం చెప్పరాదు.

శి : అంతఃకరణ వికార చలనమే జీవత్వమంటేనో?

గు : (3) అదియును నిలువదు, జలచంచలత్వము చేత గగన సూర్యచంద్రాదుల చలనములూ పుట్టుచున్నవి. నావ మీదనున్నవానికి ఒడ్డునున్న లతావృక్షగుల్మాదులు చలించినట్లు, పైత్యించినవానికి భూమిన్ని గృహాములున్ను తిరిగినట్లున్ను, మేఘము నడుస్తూవుంటే చంద్రునికి తీవ్రగమనము తోచినట్లున్ను ప్రతిబింబమునందు చలనములు తోచినను కర్తృత్వాదులు చెప్పకూడదు.

శి : ప్రతిబింబమునకు చలనాదులు స్పష్టముగా తోస్తూనే వున్నవి?

గు : ఎవరికితోచెను? ప్రతిబింబమునకా? అంతఃకరణమునకా? ప్రతిబింబము మిథ్యాభూతము గనుక దానికి తోచదు అంతఃకరణ జడము కనుక దానికీ తోచదు. అధిష్ఠానమైనచిత్తుకు జీవత్వము చెప్పరావేమో! చైతన్యము సర్వాకారముగదా! కనుక దానికి చెప్పకూడదు.

శి : అధిష్ఠాన చేతనము వికారము చెందకనే జీవుడాయెనా? లేక వికారం చెంది జీవుడ యెనా? ఏమనాలి?

గు : వికారం చెందకపోతే జీవుడని ఎందుకు పేరువస్తుంది? వికారం చెందితే గుణముకల్గును. గుణమువల్ల నస్యోత్పత్తి సంభవించును "వికార గుణవాన్ నశ్యోత్పత్తిః, నశ్యోత్పత్తిఃసమాయోస శూన్యం" అని వ్యాససూత్రం.

శి : అయితే ఏమి తేలినట్లు? అంతఃకరణముగాని, అంతఃకరణాధిష్ఠానముగాని, అంతఃకరణ ప్రతిబింబముగానిజీవుడనరాదు. ఐతే, యిందేరెండైనా కలసి జీవుడు కాకూడదా?

గు : అంతఃకరణమున్ను ప్రతిబింబమున్నూ కూడి జీవుడంటే రెండున్నూ జడములే అయివున్నవి. అపుడు జీవునికి కర్తృత్వాద్యహంకారం సిద్ధింపదు.

శి : అట్లయితే అంతఃకరణాత్మలు రెండూగూడి జీవుడాయెనంటే?

గు : జడమైన అంతకరణకు చిత్తైన ఆత్మకు రెంటి కూటమికి జీవత్వము వచ్చునంటే, ముకురమునకున్నూ కురా వచ్చిన్నమైన సూర్యునికిన్ని జీవత్వము రావలెను.

శి : ఐననేమి? బహిఃపదార్థములైన సూర్యముకుర సంయోగమున అగ్ని జనించినట్లే, అంతఃపదార్థములైన అంతఃకరణాత్మ సంయోగమునకు జీవత్వము రావచ్చును.

గు : బ్రిహ్మాండ పిండాండములు ఏకాకారముగనుక బ్రహ్మాండ అంతఃపాతములైన ముకుర సూర్యకూటమి

కిన్ని అహంకర్తృత్వ సహితమైన జీవత్వము రావలెను. కనుక పిండాండాంతఃరములైన అంతఃకరణాత్మ కూటమికి జీవత్వము చెప్పుటలో విరుద్ధము.

శి : అయితే అధిష్ఠాన చైతన్యమున్నూ ప్రతిబింబచైతన్యమున్నూ గూడి జీవుడనుట కాక్షేపణయుండజాలదనుకొంటాను.

గు : చైతన్యమైన చిత్తునిర్వికారము-ప్రతిబింబ చైతన్యముతో గూడి వికారం చెంది జీవుడైనదని చెప్పరాదు. చెప్పితే పరతత్వహాని. దానికి పైనచెప్పిన విధముగా నశ్యాపత్తిన్ని సంభవించును.

శి : పోనీ, అంతఃకరణ ప్రతిబింబ చైతన్యమున్నూ అంతఃకరణాధిష్ఠాన చైతన్యమున్నూ అంతఃకరణమున్నూ మూడూగూడి జీవుడని చెప్పితేనేమి?

గు : బ్రహ్మముతప్ప రెండోది లేదుకదా! అంతఃకరణమేలాగు వచ్చెను? ఎక్కడ నుండెను? తదధిష్ఠానము ఎక్కడ నుండె? దాని ప్రతిఫలితమెక్కడనుండె? సర్వత్రసచ్చిదానందమే వుండగా ప్రతిఫలించుటకు అవకాశమెక్కడిది? రూపమే లేనిదానికి ప్రతిఫలితం ఏలాగు? వీటిని ఎవరైన ఒక చోట కూర్చినారా? వాటికవే కూడెనా? ఇవి ఏలా పుట్టెను?

శి : బ్రహ్మముయొక్క మాయవలన పుట్టెను.

గు : మాయాబ్రహ్మలకు భేదమా అభేదమా? భేదమందామా? బ్రహ్మ కన్యముగా పదార్థముకటున్నదంటే, అద్వైతహాని సంభవించును. అభేదమంటే, బ్రహ్మమువలననే

పుట్టెననవలెను. యికమాయ ఎందుకు?

శి : బ్రహ్మమువల్లనే పుట్టినదంటే ఏమిపోయె?

గు : వానిని పుట్టించిన బ్రహ్మ మెలాగు పుట్టెను? పుట్టించు దానికి పుట్టుకయుండక తప్పదు అనిశాస్త్రం. మాత వృక్షమందు ముష్టి పండ్లు కాయునా? ఆలాగే తాను నిర్మలుడున్నూ ప్రపంచం మలినమున్నూ ఏలాగు? తనకు నిత్యత్వమేలాగు? ప్రపంచమునకనిత్యత్వమేలాగు?

శి : కొంతమంది భక్తులేమన్నారంటే........ కూటస్థమై అనిర్వాచ్యమై చైతన్య స్వరూపమైన బ్రహ్మమందు జీవులు జగములు కల్పితమాయెననిన్ని పరమాత్మ అంశములే జీవులనిన్ని అందురు.

గు : అదిన్ని సరికాదు. ఎట్లు కల్పితమాయెను?

శి : స్వశక్తివలన.

గు : ఆధారముంటేకదా శక్తి పుట్టడం? ఏశక్తివలనపుట్టెను?

శి : బ్రహ్మ యొక్క యిచ్ఛవలన శక్తి పుట్టెను.

గు : నిర్గుణ బ్రహ్మమందు సగుణమైన ఇచ్ఛయేలాగున పుట్టును? శక్తివుంటే యిచ్ఛ పుట్టెనా? యిచ్ఛవుంటె శక్తి పుట్టెనా? శక్తిగలవాడూ యిచ్ఛగలవాడూ అయితే అందరివంటివాడే అవును, ఆపరవస్తువు ఏలాగున పుట్టించెను? అదియే రూపం?

శి : నిరూపము

గు : నిరూపమందు యీ రూపములు ఏలాపుట్టును?

శి : రజ్జుసర్పవత్ దోచెను.

గు : ఎవరికిదోచెను? తోచడమునకు అనడమునకు వీరు

యెక్కడనుండి వచ్చిరి? తిరిగి ఎక్కడకి పోతారు?

శి : విలక్షణునియందు కల్పన అయెను.

గు : అప్పుడాతడు నిర్గుణుడు యిరి సగుణము అగునా? విలక్షణుడు కల్పించునా? ఒకరిని యెప్పుడు కల్పన చేసెనో తనకున్ను కల్పితము వుండును కల్పితము చేసినవాడు విలక్షుణుడెట్లాగౌతాడు? మరిన్ని తండ్రి నిత్యుడు యేలాగు? పుత్రుడనిత్యుడేలాగు? రెండూ నిత్యత్వములే; లేకపోతే రెండూ అనిత్యములే కావలెను.

శి : రెండూ నిత్యమే అంటేనో?

గు : అద్వైత్వము ప్రకారం రెండు నిత్యవస్తువులుండుటకే వీలులేదు. అంతా నిత్యమైతే జనన మరణములు లేకపోవలెను కనుక రెండునూ అనిత్యములేఅనవలెను,

శి : అదనిర్వికారము. అది చెయ్యదు. అదిమాయకాదు. నిత్యవస్తువు అని శ్రుతి స్మృతులు బల్కుచున్నవి. అదే మాయఅంటే జన విరోధముకదా?

గు : "సత్యంజన విరోధాయ" అన్నమాట మరువకు. అదే మిథ్యారూపము అనాలి. అంతికంటెమాయ అవనిలో లేదు. అది నిష్క్రియంకాదు. అదే సమస్త కార్యములు చేయును. "ఏనేక్షతిశ్రుణోతీదం, జిఘ్రతి వ్యాకరోతిచ। స్వాదస్వాదువిజానాతి తత్ప్రజ్ఞానము దీరితం" అది ప్రజ్ఞానరూపంగా జీవోపాధులయందు పనిచేస్తుంది. "సఏవమాయా పరిమోహితాత్మా శరీర మాస్థాయ కరోతిసర్వం." ఆపరమాత్మయే సకల

శరీరాలయందు ప్రవేశించి మాయా మోహితమై సకల కార్యాలు చేస్తోంది.

శి : అట్లా చేసేదంతా మాయేకదా!

గు : అదే బ్రహ్మము, అదే మాయ, రెండు కావు. రెండుగా లేవు. యీ మాయా బ్రహ్మలు రెండూ లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మమని తెలియవలెను.

శి : కొంతమంది బ్రహ్మ విశ్వకారణము కాలేదనిన్ని నిర్గుణుడనిన్ని అంటున్నారే!

గు : విశ్వకారణం కానిది, శుద్ధ నిర్గుణమైనదీ, పరిపూర్ణ పరబ్రహ్మమని తెలియవలెను. కాని శ్రుతి "యతోవా యిమాని భూతాని జాయంతి ఏనజాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తత్బ్రహ్మేతి" అని విశ్వకారణమగునది సచ్చిదానంద స్వరూప బ్రహ్మము అని తెలియచేయుచున్నది. ఇట్టి మాయా బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మముకాదు. ఈమాయా బ్రహ్మ రహితమునందే పరిపూర్ణ పరబ్రహ్మనిశ్చయం.

శి : మీ బోధవలన ఏమి ప్రయోజనం?

గు : ఎండ సోకితే మంచు విచ్చిపోయినట్లు, యీ బోధ తెలిస్తే సచ్చిదానంద స్వరూపమైన మాయ నశించిపోవును.

శి : కొంతమంది ఈశ్వరుడు వున్నాడని అతడు సర్వకర్త అనిన్ని అంటారు

గు : మూలాభావమైన వృక్షమునకు శాఖాదులు శూన్యమని చెప్పనక్కరలేదు. సచ్చిదానంద రూపమైన

చైతన్యమే లేదంటే తత్సంబంధమైన ఈశ్వరుడులేడని చెప్పనక్కరలేదు.

శి : ఐనా ఈశ్వరుడు డెట్లు లేడో సెలవీయండి స్వామీ!

గు : మాయ, మాయాధిష్ఠాన చైతన్యము మాయా ప్రతిబింబ చైతన్యము యీ మూడూ ఈశ్వరుడవ్వారు. యిందేదీ ప్రత్యేకంగాగాని, రెండుకలసిగాని, మూడూ కలసిగాని, ఈశ్వరుడు అని చెప్పరాదు.

శి : యెందుక్కు చెప్పరాదు?

గు : మాయకు కేవలంగా ఈశ్వరత్వం చెపితే, దర్పణము నకున్ను భూతాకాశమునకున్ను, కూడా ఈశ్వరత్వము రావలెను.

శి : అవి వుత్పత్తి అయినవి. అవి భావపదార్థములు. మాయ అనాది అభావపదార్థము. రెంటికీ భేదా లేదా?

గు : వర్ణ జాతి కుల గోత్రములు అభావపదార్థములే! ఈశ్వరత్వము వానికేల రాలేదు? శశివిషాణ గగన కుసుమముల కేలరాలేదు? మాయ జడము గనుకనున్నూ మిథ్యాభూతము కనుకనున్నూ దానియందు స్వతఃశక్తి లేకపోవడంవల్లనున్నూ మాయకు ఈశ్వరత్వంచెప్పరాదు.

శి : మాయా ప్రతిబింబానికి ఈశ్వరత్వము చెప్పవచ్చునా?

గు : ఎంతమాత్రం చెప్పరాదు, మాయే లేకుంటే దాని యందు ప్రతిబింబ మెక్కడిది? తాను స్వయంగా పోయినా కాని కార్యం చీటీ పంపిస్తే కాగలదా?

శి : మాయా, మాయా అధిష్ఠాన చేతనము మాయా ప్రతిబింబమూ యీ మూడూ కలసిన కూటమికి ఈశ్వరత్వం

చెప్పితే ఏ బాధా లేదు.

గు : కాదు కాదు, ఆ మూటి కూటమికి ఈశ్వరత్వం చెపితే మినుములు కందులు వడ్లు కలబోస్తే వీనికిన్ని రావలెను.

శి : మీరు చెప్పునవి బాహ్య పదార్థములు.

గు : అయితే అంతఃపదార్థములయిన వాత పిత్త శ్లేష్మాదుల కూటమికి వచ్చునా?

శి : వాత పిత్తాదులు యేకజన్మసిద్ధములు—వానిదృష్టాంతం సరిగాదు,

గు : అనేక జన్మసిద్ధములైన వాయువులకున్నూ చిత్తాదులకున్నూ చెప్పవచ్చునా?

శి : అయితే కర్తృత్వ [illegible] యిత్యాత్వములు [illegible] సేవక స్వామీ ఆత్మ సర్వకారంకాదా?

గు : మయ్యేవ సకలంజాతంమయి సర్వం ప్రతిష్ఠితం। మయి సర్వం లయంయాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహం" అని శ్రుతి ప్రమాణమున్నది. ప్రకృతి మండలస్థితి, స్థూల సూక్ష్మకారణములైన దేహాదులున్న. యితర వస్తువులున్నదాన్నించేఅవుతున్నాయి. ఆ దేమాయ.

శి : అది యెప్పుడు పుట్టింది. ఎప్పుడు పోతుంది?

గు : తోచినపుడు పుట్టింది విచారించినపుడు పోయింది ఈ రెండూ లేనపుడేమీ లేదు. విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు కంటె స్వరాట్ కంటె అతీతము అగు అనిర్వచనీయం. అది ఎప్పుడూ ఏమీ లేదు. యిదే నిశ్చయం—యిట్టిబోధయే సర్వభ్రమ రాహిత్యం.

———

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ఏడవ ప్రకరణము

## సచ్చిదానందములు-పరిపూర్ణము

శి : గురుస్వామీ! ఏకకంటారు. అది ఏది? ఎక్కడుంది?

గు : శ్రు॥ సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. యో వేదనిహితం గుహాయాం పరమే వ్యోమన్॥

శి : సచ్చిదానందములకున్నూ సత్యజ్ఞానానంతములకున్నూ భేదా ఏమి.

గు : సత్యమే సత్తు జ్ఞానమే చిత్తు అనంతమే ఆనందము. ఈ మూడును సగుణము కావని అన్నారు. వీని అర్థము వాచ్యార్థము, లక్ష్యార్థము, అనుభవార్థము, నిర్ణయార్థము అని నాలుగు విధములు.

శి : అవి ఏలాగో వివరించండి స్వామీ!

గు : 1) జాగ్రతసత్తు. స్వప్నముచిత్తు. సుషుప్తి ఆనందము ఇది వాచ్యార్థము.

2) సకలేంద్రియ సమూహము సత్తు. సకలేంద్రియ భాసకత్వము చిత్తు. రెంటికి విలక్షణమై సుఖకరమైనదే ఆనందము. ఇది లక్ష్యార్థము.

3) వృత్తే సత్తు వృత్తి ప్రకాశమైన జ్ఞానమే చిత్తు. రెంటిని విచారించి సత్తామాత్రమై అతీతమైనదే ఆనందము. ఇది అనుభవార్థము.

4) ప్రత్యగాత్మ సత్తు. పరమాత్మ చిత్తు. అది తాను అని తెలియుడమే ఆనందము.

శి : ప్రత్యగాత్మా పరమాత్మల భేదమేమి?

గు : 1) పంచకోశసాక్షి ప్రత్యగాత్మ. పంచభూత అధిష్ఠానమే పరమాత్మ.

2) పిండాండాశ్రియమైనది ప్రత్యగాత్మ - బ్రహ్మాండాశ్రియమైనది పరమాత్మ.

3) సచ్చిదానంద లక్షణముగలది ప్రత్యగాత్మ - సత్య జ్ఞానానంత లక్షణముగలది పరమాత్మ.

రెండూ ఒక్కటే.

శి : నిర్ణయార్థ మేలాగు?

గు : జగత్తు సత్తు-జీవుడు చిత్తు - ఈ రెంటికి ప్రకాశకమై ఈ రెంటిని గుర్తెరిగే బ్రహ్మమే సర్వమని తెలియడమే ఆనందము. ఈ సచ్చిదానందములు అన్నియు గుణములు, గుణాధారమైనదియు గుణమేకనుక అదన్ని నిలువదు. కనుక అదన్ని పరిపూర్ణము కాదు

శి : ఎందుచేత?

గు : అవిసగుణములు కనుక పరిపూర్ణము కాదు. ఏలాగంటే- శ్రుతి॥ "సచ్చిదానందహీనోయ ఏషైవాత్మా సనాతనః" సచ్చిదానందములు సగుణములు కనుకనే సచ్చిదానంద హీనుడని శ్రుతి చెప్పినది. ఇంతేకాకుండా "శ్లో॥ సాలంబస్యాప్య నిత్యత్వం నిరాలంబస్య శూన్యతః" అని గీతావాక్యమున్నది. కనుక గుణాధారము గుణమే కాని నిర్గుణము కాదు. దీనిని పరిపూర్ణము అనే మాట

అసంభవము.

శి : ఆ సచ్చిదానంద లక్షణములు నాయందెట్లున్నవి?

గు : సత్తు అనగా మూడు కాలములయందున్నదగదా! ఆ సల్లక్షణము నీకు ఏలావున్నదంటే— వెనుక పుట్టితిన నిన్ని, పుట్టి పుణ్యపాపములు నేననుభవిస్తున్నాననిన్ని ముందు పుట్టి అనుభవిస్తాననిన్ని. యీ సల్లక్షణము చెప్పాను. కనుక సత్స్వరూపత్వమున్నూ. స్వ్రపపం చము నాచేత ప్రకాశిస్తూవున్నది, కనుక చిత్స్వరూప మున్నూ. సర్వాధిష్ఠాన హేతువువల్ల వృత్తి శూన్య మైనపుడు ఆనందమున్నూవున్నవి. కనుక యీ అన్ని లక్షణములు నీయందునున్నవి.

శి : మరి (నా వెలుపల) బాహ్యమందేలాగున్నవి?

గు : బాహ్యమందు మూడుకాలాలయందున్నది కనుక సత్తున్నూ. సూర్యచంద్రాగ్నుల ప్రకాశింపచేస్తున్నది కనుక చిత్తున్నూ, సర్వదుఃఖ ధ్వంసమే ఆనందమున్నూ

శి : దుఃఖమనగా నేమి?

గు : దుఃఖమనగా జీవభ్రాంతి, "దుఃఖధ్వంసో మోక్షః" అన్నారు.

శి : సత్తు చిత్తు ఆనందములు భిన్నమా? అభిన్నమా?

గు : అగ్నియందు లోహితోష్ణ ప్రకాశములు ఏలాగో ఆలాగే. కనుక అభిన్నమే. అదే కాకుండా సత్తు చిత్తు ఆనందములు యీ దేహాన్ని పట్టే కాని నేనైన ఆత్మకు ఏమీ లేదు.

గు : దేహము అనృతము గనుక దేహవిలక్షణమై దేహాధి

ప్రాసమైన ఆత్మసత్తనిన్ని. దేహము జడస్వరూపము కనుక దీనిని ప్రకాశింపచేసి గుర్తెరిగెడిది చిత్తనిన్ని, దేహము దుఃఖము కనుక, దేహాన్ని గుర్తెరిగెడి చైతన్యము విలక్షణము గనుక, ఆనందము అనిన్ని చెప్పబడును.

శి : విలక్షణమనుటెలాగు?

గు : "ఘటద్రష్టా ఘటాద్భిన్నో సర్వథా. నఘటోయథా" ఈలాగునవున్నది కనుక దేహాన్ని పట్టేగాని ఆత్మకు ఏ వికారములేదు.

శి : సుఖదుఃఖములు జడమైన దేహానికో, అసంగమైన ఆత్మకో సెలవీయండి.

గు : ఆత్మకు ఎప్పుడులేవో, దేహానికి అప్పుడే లేవు. రెండూ ఒక్కటే దీనిని విడచితే అది అనుభవించదు, దాన్ని విడచితే ఇది అనుభవించదు. అదే కాకుండా ఎరిగే దానికే అన్నియుగాని ఎరుగనిదానికి ఏమీలేదు.

శి : అవి అన్నీ ఎవరికి తోచును?

గు : నీవు బ్రహ్మవైతివికదా. ఇవి ఎవరిచేత చెప్పబడెను?

శి : వేదశాస్త్రములచేత

గు : వాటివల్ల నీవు పుట్టినావా? లేక నీ వల్లనవి పుట్టినవా?

శి : అవి బ్రహ్మచేత పుట్టెను.

గు . ఐతే చతుర్ముఖునియందూ నీయందూ ఆత్మ ఒక్కటా? రెండా?

శి : ఒక్కటే

గు : ఐతే అతనివల్ల పుట్టినవి అని ఎందుకంటావు?

శి : అవును. నా చేతనే పుట్టెను (అని అనవలసినదే)

గు : అవి ఎవరికి ప్రమాణము?

శి : నాకే ప్రమాణము.

గు : (కనుక) నీవే మాయకు మూలము. నీవు సత్యమేలాగు? నీవల్లనైనవి అసత్యమేలాగు?

శి : పోనీ నావల్ల పుట్టినవి కూడా సత్యమనియే అంటేనో?

గు : నీచేత పుట్టినవి సత్యము కావు కనుక నీవును అసత్యమే అనాలి

శి : లక్ష్యార్థంలో దేహేంద్రియములు సత్యములేలాగు?

గు : కర్తవు, భోక్తవు నీవే కదా!

శి : నేను సాక్షిని. నేను చియ్యాను. దేహేంద్రియములు చేస్తవి.

గు : నీవు చేస్తివే!

శి : నా సత్తాచేత దేహేంద్రియములు చేసెను నేను చేయలేదు.

గు : అవి నీకు భిన్నమా? అభిన్నమా? భిన్నమంటే అద్వైతా? పోని అభిన్నమంటే అవి చేస్తవి అని ఎందుకంటావు? నేనే చేస్తానని యనరాదా? నీ సత్తాచేత అవి చేసేటట్లువుంటే, సుషుప్తి మొదలైనవానియందు ఏలా చెయ్యవు?

శి : అపుడు మనస్సులేదు కనుక చలించవు.

గు : నీవనగా ఎవరు? మనస్సనగా ఎవరు? నిన్ను విడిస్తే అది లేదు. దానిని విడిస్తే నీవు లేవు నీవు కర్తవు కాకుంటే నేను చేస్తినని, నాకు రోగం వచ్చెనని అనుచున్నావే!

కనుక నీవే మాయ; నీవు లేకుంటే ఏమీ లేదు. నీవు గురుముఖముగా మూలము తెలిసికోవడమే దేహపతనము

శి : నా దేహము, నా మనస్సు అని అనుచున్నాముగదా!

గు : నా దేహము నా మనస్సు అనగానే, తనకంటే భిన్నమని చెప్పకూడదు. అంటే, రెండూ శూన్యమే, లేకుంటే రెండూ సత్యమేననాలి అది విలక్షణమైన జ్ఞానమనిన్నీ, ఇది అజ్ఞానమనిన్నీ, అనకూడదు. రక్త క్షీరములు రెండునూ ఒక్కటే. తాను మేలుకుంటే ఎప్పుడూ లేడు. కనుక ఉన్నావని అనరాదు.

శి : అనుభవార్థమెట్లో వివరింపవేడెదను.

గు : అనుభవార్థముచేత నేనో తాను, లేకపో తాను. దృశ్యమే సత్తు, దృక్కే చిత్తు, దృష్టే ఆనందము. అదే అంతర్బహిస్సులు ప్రకాశింపచేసినది. లాంతరులోనున్న దీపమువలె సూర్యుడు స్వభాసకుడై తాను తనంతట ప్రకాశిస్తూ అన్నిటిని ఏలా ప్రకాశింపచేయునో, ఆలాగే దేహేంద్రియాది సర్వప్రపంచమునకున్న భాసకుడై చక్షురంతర్గతవర్తియై యున్నాడు.

శ్రుతిస్మృతులచేత ప్రసిద్ధమై, అంతరమందు యోగలక్ష్యముచేత సాధ్యమై, జ్యోతిర్మయమై స్వరూపమైన ఆనందమే మోక్షము అని అంటారు. కాని పరిపూర్ణమైన బ్రహ్మ దృశ్యంకాదు. దృక్కు కాదు. నీవైన ఆనందము మాయ. నీవు మాయ. మాయ కానవస్తే ఏమి మోక్షము?

శి : శ్రుతిస్మృతులు యీలాగున యెందుకు చెప్పవలెను?

గు : పామరులకు ఉపాసన నిమిత్తమై చెప్పినవి శరీరముండు లేక వున్నదని దీక్షితులవారనిరి. అది బాహ్య పదార్థములవంటిదేనా? అదే బ్రహ్మమైతే అణుస్థూలాది రూపములచేత కానవచ్చునా? అట్లా కానవచ్చేదైతే ఒక పరిచ్ఛిన్నమాయకు సర్వవ్యాప్తమైనది, ఒకచోట యేలాగున కానవచ్చును? కానవచ్చేది మాయయే కాని పరిపూర్ణమైన పరబ్రహ్మము కాదు.

శి : పోనీ, యోగమునందైన కానవచ్చునా?

గు : యోగములవల్ల పరిపూర్ణము సాధింపబడితే అప్పటికిన్ని పరిచ్ఛిన్నమాయేను. అవ్యాప్తి వచ్చును. తానే లేదు గనుక అనుభవమెవరికి?

శి : కొందరు చిత్తలయమే మోక్షమన్నారు గదా!

గు : చిత్తలయమే మోక్షమైతే, సుషుప్తి, మూర్ఛ తూష్ణీభూతావస్థలయందును మోక్షము రావలెను. దీనివంటిదే సమాధి. గురునివలన మాయ అనే తెరదీస్తే సాక్షాత్కార పరిపూర్ణ పరబ్రహ్మమే స్వతస్సిద్ధము. తాను ఎక్కడా లేను. కనుక తనకు సత్తు చిత్తు ఆనందములు, అనృత జడ దుఃఖములు యేమిన్ని లేవు.

శి : ఐతే. తానది కాజాలడా?

గు : తాను మునుపు కాని వస్తువు అగునా? అయిన వస్తువు తెలిసినా తెలియకవున్నా కాకపోవునా? బంగారము వెండిన్ని, వెండి బంగారమున్నూ తెలిసినా తెలియకున్నా కానట్టు, అయిన వస్తువు కాకపోదు. కాని

వస్తువు కాబోదు.

శి : నిర్ధయార్థమందు నిరసన ఏలాగు?

గు : నిర్ణయార్థమేలాగంటే- అసత్యము సహించనిదే సత్తు జడత్వమును పొందనిదే చిత్తు ప్రియాప్రియరహితమే ఆనందము

శి : ఇటువంటి సచ్చిదానంద స్వరూపమే బ్రహ్మము, ఇంతకంటే ఎక్కువలేదుగదా, -ని అనిపిస్తోన్నది స్వామీ.

గు : సచ్చిదానంద స్వరూపము పూర్ణము ఏలాగు? ఎవరికీ పూర్ణమైనట్టు ఏలాగునా కనుపించదు

శి : సర్వత్రా వున్నది. ఏలాగునచూస్తే ఆలాగునేవున్నది.

గు : కలసి కలియక, సర్వత్ర ప్రకాశిస్తున్నదంటే అది బ్రహ్మము కాదు. అది మాయ స్వరూపము.

శి : సచ్చిదానంద స్వరూపము పూర్ణము కాదనుట ఎట్లు?

గు : శ్రుతి॥ అసద్వా ఇదమగ్ర ఆసీత్-తతో వై సదజాయత॥ అని వున్నది కనుక సత్తుకు జన్యత్వము అంగీకరించుట వల్ల నాశనము కలుగుతుంది. కనుక సత్తు పూర్ణము కాదు. "యజ్జన్యం, తజ్జడం, తన్నశ్యం భవతి, సదసద్రహితం పూర్ణమనామయరూపకం" స్వయం ప్రకాశమైన చిత్తున్నూ పూర్ణముకాదు.

శి : చిత్తు ఏల పూర్ణవస్తువు కాదు?

గు . ఏలాగంటే (ఉత్తరగీత) "ప్రభాశూన్యం, తమశ్శూన్యం, బుద్ధి శూన్యం, నిరామయం, తిశూన్యం యోవిజానీయాత్ సద్యోముచ్యేత బంధనాత్"

శి : ఎందుచేత? అందుకు ప్రమాణమేమి?

గు : శ్రుతి : "జ్ఞానమానందకం బ్రహ్మయిత్యుక్తం మూఢమానవైః భ్రాంతి మూలమిదం జ్ఞానం. జ్ఞానం భ్రాంతిస్తు నిశ్చితం, జ్ఞానాన్నా జాయతేఽనందః ఆనందం భ్రాంతిలక్షణం సత్యజ్ఞానమనంతంచమాయా గుణమితి శ్రుణు" అని శ్రుతిస్మృతులచేత చెప్పబడి యున్నది కనుక సచ్చిదానంద స్వరూపము పరిపూర్ణము కాదు.

శి : కొంతమంది నామరూపములు మిథ్య అని అస్తి భాతి ప్రియములు బ్రహ్మమని అందురుగదా!

గు : శ్లో॥ అస్తి భాతి ప్రియం రూపం నామచేత్యంశ పంచకం ఆద్యత్రయం బ్రహ్మరూపం, మాయారూపం తదోద్వయం॥
అని చెప్పివున్నది. అస్తి భాతి ప్రియములు పరిపూర్ణమైన అచలము కాదు.

శి : ఎందుచేత ప్రభో?

గు : ఏలాగంటే (1) అస్తి భాతి ప్రియములు నామరూపములయుండేగాని, నామరూప రహితమందు లేవు. అదే కాకుండా (2) రూపము పుట్టగానే, అస్తి భాతి ప్రియములు పుట్టెను. కనుక రూపశూన్యకాలమందు అస్తి భాతి ప్రియములు శూన్యమవుతవి. కనుక అస్తి భాతి ప్రియములు బ్రహ్మమనిన్ని నామ రూపములు మాత్రము మాయయని యనగూడదు పామము కొక్కవయున్న పడగపగయున్న అవునా?

కనుక యీలాగనరాదు. కీలు ఎరిగి వాతపెట్టవలెను. గురుకృపచేత పరిపూర్ణబోధ పొందితే జగదాధారమై ప్రకృతి పురుషాత్మకమై కనపించెడి ఎరుక ఎంత మాత్రము నిలువదు.

శి : మరి స్వసాక్షియో?

గు : ఈ నిలువని ఎరుకే విద్యావిద్యలకు సాక్షి. సూర్యుని యందుదయాస్తమానములు ఏలాగున కల్పితమగుచున్నవో ఆలాగే ఎరుకయందు సర్వము కల్పితమైనది.

శి : ఐతే ఈ యెరుక ఎన్ని పదార్థములుగా తోస్తూవున్నది?

గు : శ్లో॥ దృగ్దృశ్యౌద్వౌ పదార్థౌ తౌ పరస్పర విలక్షణౌ
దృగ్బ్రహ్మ దృశ్యంమాయేతి, యితివేదాంత డిండిమః

అని చెప్పినప్పటికిన్నీ, దృక్స్వరూపమై, అస్తి భాతి ప్రియ స్వరూపమై, స్వరూపములయందున్న ఎరుక, బ్రహ్మము (పరిపూర్ణ బ్రహ్మము) కాదు.

శి : కొందరు నామరూపములు లేనిచోట అస్తి భాతి ప్రియములు కలవని అంటారు. ఏలాగంటే. జలమున్న చోటసూర్యచంద్రాది ప్రతిబింబములు కనపించును. జలాభావమందు ప్రతిబింబాభావమేగాని బింబాభావములు కానట్లు. నామరూపములువుంటే అస్తి భాతి ప్రియములు దృష్టమౌను నామరూపములు లేకపోతే అస్తి భాతిప్రియములు దృష్టము కావు కానివున్నవని అంటారు. ఏలాగంటే ముకురాభావమందు ముఖము దృశ్యము కానప్పటికిన్ని ఏలాగువున్నదో ఆలాగే అస్తి భాతి ప్రియములు

వున్నవని అంటారు. అస్తి సత్తు. భాతి చిత్తు. ప్రియమే ఆనందము. అంతే కాకుండా తన వృష్టము తనకు కానరానప్పటికిన్ని పరులను చూచిన్ని స్పర్శవల్ల నుంచిన్ని ఏలాగున వున్నట్టు వూహించునో ఆలాగే వూహించవచ్చును. అదే కాకుండా ఎప్పుడు తాను తలిస్తే అప్పుడస్తి భాతి ప్రియములు తనయందు స్ఫురిస్తూవున్నవి.

గు : శశశృంగమున్నూ తలిస్తే స్ఫురిస్తూవున్నది. కనుక అదీ వుండవచ్చును. అదే కాకుండా మీరు చెప్పిన దృష్టాంతములు మాయా బ్రహ్మమైన సచ్చిదానంద స్వరూపమందేగాని యీ బోధయందు నిల్వవు. ఏలాగంటే సూర్యుడు ఎప్పుడూ (ఏక ప్రదేశములో మాత్రమే) వుండువాడు గనుక ప్రతిబింబమును నమ్మవచ్చును. పరిపూర్ణమైతే సర్వవ్యాప్తము. ఆకాశరహితము. కనుక సూర్యునికివలె ప్రతిఫలితము చెప్పకూడదు. ప్రతి ఫలితానికి అవకాశము వుంటేనేగాని అవదు. (ప్రతిఫలించదు) కనుక సర్వపరిపూర్ణమై, అవకాశరహితమై, నిరూపమై, గంతవ్య దేశవిహీనమై రాకపోకలులేక అనిర్వాచ్యమై, చరాచరములందు నిండి నిబిడమైయున్నదే పరిపూర్ణము రెండోది పరిపూర్ణము కాదు. పరిపూర్ణమైన అచలము వినాగా స్థలము లేదు గనుక ప్రతిఫలితము లేదు మీరు చెప్పినఆత్మయున్నూ పరిపూర్ణమైతే ప్రతిఫలితము చెప్పకూడదు.

శి : సర్వవ్యాప్తమైన ఆకాశము జలమందున్నూ

దర్పణమందున్నూ ఏలాగున ప్రతిఫలించెనో ఆలాగే ఆత్మయున్ను ప్రతిఫలించెను.

గు : ఆకాశ ప్రతిబింబము వాస్తవమేలాగు? ఆకాశము శూన్యమని వారే అందురు. కాబట్టిన్ని రూపరహితము కాబట్టిన్ని ప్రతిబింబము కూడదు. ఇదే కాకుండా మాయ, గగనకుసుమమువంటిదే కాబట్టిన్ని ప్రతిఫలితము కూడదు. కనుక యేలాగు ప్రతిఫలించె? పగలు తేజస్సున్నూ రాత్రి తమస్సున్నూ ప్రతిఫలితమే కాని, రెండూ కాని గగన ప్రతిబింబమే లేదు. ఉన్నదంటే ఏ తీరుగానున్నది? ఏ తీరునైనా ఆలాగున చెప్ప కూడదు.

సూర్యుడొకచోట నుండేవాడు గనుకనున్ను పదార్థ స్వరూపము కనుకనున్ను ప్రతిబింబము అంగీకారము. పరిపూర్ణము అనవిచ్ఛిన్నము కనుక అంగీకారము కాదు.

శి : ఆ పరిపూర్ణ మెటువంటిది?

గు : సర్వవ్యాప్తమున్నూ నిరూపమున్నూ కనుక ఏ వికారములున్నూ ఏ లక్షణములున్నూ చెప్పకూడదు. సచ్చిదానంద స్వరూపమైన అస్తి భాతి ప్రియములే అన్ని పదార్థములాయెను. అదే మాయా స్వరూపము. అదే తాను. తాననే తెరను గురుకృపచేత తీసి చూస్తే అంతా పరిపూర్ణమే. దేశకృత కాలకృత వస్తుకృత పరిచ్ఛేద రహితమై, అభిన్నమై ఆద్యంత రహితమై సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమై, చరాచర

ములనిండినిబిడీకృతమై, స్వతస్సిద్ధమై ఉత్పత్తి స్థితిలయ రహితమైయున్నదే పరబయలు సగుణ నిర్గుణ రహితము, జ్ఞాతృ జ్ఞాన రహితము. సర్వకాల సర్వావస్థల యందు అది యొక్క తీరే.

శి : దానికై ఏమి సాధనలు చేయవలె?

గు : అటువంటి పరిపూర్ణముకొరకు ఏ సాధనలూ అక్కర లేదు.

శి : అది ఏలాగు స్వామీ?

గు : ఒకచోట మరచిన వస్తువు మరియొక చోట వెదకితే యేలాగున దొరకదో ఆలాగే సాధనానంతర నిరపేక్షకమైన పరిపూర్ణము సాధనలచేత లభ్యము కాదు.

శి : మరి యెట్లు ప్రభో!

గు : పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను ఎరుగక, ఎరిగినది మరువక తాను లేకపోవడమే. పంచముక్త్యాతీత పరిపూర్ణ బోధస్థితి.

శి : పంచముక్తులనగా ఏవి?

గు : సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, సార్ష్ణిత్వ కృతార్థస్థితి - అదే మహా కైవల్యమని అందురు.

శి : ఈ ముక్తు లెట్టివి?

గు : ఈ ఐదు కర్మజ్ఞాన ముక్తులు. అటువంటివి అయినదూ గాక సర్వాతీతమై స్వస్వరూపరహిత అహంకార వర్జితాచల స్థితిగలవానికి తానైన ఎరుక సర్వకాల సర్వావస్థలయందు. లేనేలేదు ఇదే సత్యము. ఇదే దృఢము ఇంతకన్న ఎక్కువ లేదు.

—*—

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## యెనిమిదవ ప్రకరణము

## మాయాబ్రహ్మము - పరిపూర్ణము

శి : ప్రకృతి అంటే ఏది స్వామీ?

గు : గుణముల యొక్క సామ్యావస్థకే ప్రకృతియని పేరు.

శి : గుణములేవి? వాని సామ్యావస్థ అనగా యెట్టిదో దృష్టాంతరూపంగా సెలవీయుండిస్వామీ.

గు : సత్వరజస్తమోగుణములని మూడు గుణములు. యెఱ్ఱనూలు, నల్లనూలు, తెల్లనూలు మూడూ కలియ పేనితే యేలాగో ఆలాగే దృశ్యమానమైయుండును.

శి · అవి యెట్లు దృశ్యమానములై యున్నవి

గు : అవి ప్రకృతి మండలమందుండును. ప్రకృతి మండలమంటే హృదయాకాశమండలము. చరాచర ప్రపంచ రీతిగా దృశ్యమానము. అదే జననమరణాస్పదమైన జనపదమండలం. భువనైక కర్ణిక, చిద్బిందుపీఠం, త్రైలోక్య దర్పణం అని వివిధ నామములు వహించినది. అదే మాయకు స్థానం.

శి : మరి పరమాత్మ అనేది ఏది?

గు : మాయకు మరో పేరే పరమాత్మ దానియందే బ్రహ్మాండపుంజములు నిండియుండును.

శి : సూక్ష్మమైన ఆ పరబ్రహ్మయందు. స్థూలమైన బ్రహ్మాండ పుంజములు యేలా వున్నవి?
శ్రుతి : తస్యాంతేసుషిరగుం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం॥ యీలాగున, శ్రుతి స్మృతి ప్రమాణము లున్నవి.

శి : దీనికి దృష్టాంత మేమి!

గు : సూక్ష్మమైన ముకురమందు, స్థూలమైన ముఖమున్నూ తర్వాతిములున్ను యేలాగునున్నవో ఆలాగే వున్నవి. మరిన్ని నువ్వుల లోపల నూనె, పాలలో ఘృతము, పుష్పమందు గంధము, ఫలమందు రసము, దారుపాషాణాదుల యందగ్నియునున్న రీతిగా ప్రకృతియందు పరమాత్మ సూక్ష్మరూపంగా నున్నాడు.

శి : మరి పరిపూర్ణ మెట్లుండును?

గు : నిండి నిబిడీకృతమై, అపరిచ్ఛిన్నమై, యెరుక లేక యున్నది.

శి : యెరుక యేలాగున్నది?

గు : సర్వ స్వరూపంగా పరిణమించియున్నది. పరిపూర్ణం తప్ప సర్వమూ యెరుకే పరమాణువైనా యెరుక గానిది లేదు. యెరుకే విశ్వము. విశ్వమే యెరుక. రెండూ ఒక్కటే.

శి : అది ఏలాగు?

గు : మృత్తువల్ల పుట్టిన ఘటశరావాదులు మృత్తుకంటె ఏలా భిన్నముకావో ఆలాగే యెరుకవల్ల తోచిన యావత్తు జగత్ యెరుకకంటె భిన్నముకాదు. కార్య

కారణములకు భేదమెంత మాత్రము లేదు.

శి : మెరుక అనగా సత్తా, అసత్తా, సదసత్తా? భిన్నమా అభిన్నమా భిన్నాభిన్నమా? సావయవమా నిరవయవమా ఉభయాత్మకమా? సగుణమా? నిర్గుణమా సగుణ నిర్గుణమా?

గు : ఏదిన్ని కాదు. కాలత్రయమందునూ లేదు కనుక సత్తు కాదు. నేనున్నానని తోస్తూవున్నది. కనుక అసత్తు కాదు గగనారవిందమువలె విరుద్ధము కనుక సదసత్తు గాదు. స్వతః శూన్యముగనుక భిన్నముకాదు. చేతనా చేతనాత్మకమై తోచుచున్నది. కనుక అభిన్నముగాదు సర్వమునకు మూలకారణంగా వున్నది కనుక సావయవముకాదు. జగద్రూపకమై తోచుచున్నది. కనుక నిరవయవము కాదు. విరుద్ధము గనుక వుభయాత్మకమూగాదు. గుణాధారము కనుక నిర్గుణముకాదు. గుణహీనము గనుక సగుణమూగాదు.

శి : శ్లో॥ సన్నాప్యసన్నా ప్యుభయాత్మికానో
భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికానో
సాంగాప్యనంగా ప్యుభయాత్మికానో
మహాద్భుతాఽ నిర్వచనీయరూపా॥

అని శంకరాచార్యులవారు అది సర్వమూ అయివుందని వివేకచూడామణిలో వ్రాయలేదా? దానికేమందురు?

గు : అవును మెరుక అవి అన్నీ అగుచున్నది. ఎట్లాగంటే-కానవస్తూవున్నది. కనుక సత్తు. గురుకృపచేత విచారిస్తే యెప్పుడూలేదు గనుక అసత్తు. మెరుపువలె జల

బుద్బుదమువలె తోచి అంతలో నేశూన్యమవుచున్నది. కనుక సదసత్తు. చరచరాత్మకముగానున్నది. గనుక భిన్నము, అన్నిటిలో చైతన్యమేకముకనుక అభిన్నము, కనుకనే భిన్నాభిన్నమున్నూ అయివున్నది. పిండాండమందు కరచరణాద్యవయవములున్నూ బ్రహ్మాండమందు వివిధత్వమున్నూ తోస్తూవున్నది. కనుక సావయవము. గుర్తెరుగు జ్ఞానమై ప్రకాశిస్తూవున్నది. కనుక నిరవయవము. ఒక ప్రక్క జ్ఞానాకారముగానూ జగదాధారముగానూ మరొక ప్రక్క ఆత్మానాత్మలుగానూ తోచుచున్నది. కనుక వుభయాత్మకమున్నూ అగును. శుద్ధ చైతన్యమై సర్వమునూ గుర్తిస్తూన్నందున నిర్గుణమున్నూ సర్వగుణములను పుట్టిస్తూన్నది కనుక సగుణమున్నూ, ఆ విధంగా యుభయాత్మకమున్నూ అవుచున్నది. సర్వము అయి సర్వము కానటువంటి యెరుకను కూడా అనిర్వచనీయమేననాలి.

శి: ఎందుకనాలి?

గు: యిదమిత్థమని యొక్క రీతిగా లేదు గనుక మార్పులు చెందుతూవుంది గనుక మాయా స్వరూపం. మిథ్యా స్వరూపం. ఏమీ అనరాదు. అనిర్వచనీయమంటే ఏమీ అనరానిదనే అర్థము. అది లేనేలేదు గనుక ఏమీ అనరాదు.

శి: వుండగా లేదన్నారా? లేకుంటే లేదన్నారా?

గు: వుండగా లేదనకూడదు. లేకుంటే లేదని చెప్పడానికిన్ని శక్తి లేదు.

శి : వంధ్యాసూనుడి వర్తమానం ఎవరేనా చెప్పుకొందురా?

గు : నేను చెప్పనేలేదు. నీకు, చెప్పినట్లు తోచినది. నాకు కల రానేలేదు. నీకలలో నేను వచ్చినట్లు నీకుతోచినది.

శి : నేను వుండగా తోచెనా లేకుంటే తోచెనా?

గు : నీవు లేకుంటే లేదని అననే అనవు. లేదని కలదని నీవు వున్నపుడే అనడం. నీవు ఉన్నపుడు లేదన్నా కాన వస్తూనే ఉండును కాబట్టి గురువాక్యం ద్వారా లేక, లేదనవలెను.

శి : లేదనడానికి యెన్ని పదార్ధములు?

గు : ఆత్మానాత్మలనే రెండు పదార్థములు. అనాత్మ అనగా జడము ఆత్మ యనగా చిత్తు. ఈ రెండే అనేక పదార్థాలుగా తోచుచున్నవి.

శి : ఏలాగు తోచును?

గు : ఒక్క యుదకం ఉపాధివశమువల్ల అనేకముగా తోచినట్లు ఎరుక అనేకముగా కార్యత్వేనా తోచినా, కారణత్వేనా యేకమని గ్రహించవలెను. యీలాగు విచారిస్తే లేనిది లేదు.

శి : ఎరుక ఆగంతుకమా? స్వాభావికమా?

గు : స్వాభావికమందామా అంటే స్వతస్సిద్ధమైన అచల మొక్కటే స్వాభావికము మరిన్ని స్వాభావికమైతే పోనేపోదు కనుక ఆగంతుకమనవలెను?

శి : స్వాభావికమైతే యెందుకుపోదు?

గు : చెరుకునకు స్వాభావికమగు తీపి పోవునా?

శి : స్వాభావికమెందుకవ కూడదు స్వామీ? ఎరుక పోతుం

దనుట మాత్రము యెట్లు?

గు : మహాత్ములైనవారు యెరుక లేకుండా నిర్దేహులై యుండుట చూచుచున్నాము ఎరుకపొయ్యేటందుకు అనేకమంది ప్రయత్నాలు చేస్తూవున్నారు.

శి : స్వాభావికమైనా పోయేటందుకు ప్రయత్నంచేస్తున్నారు అని అనకూడదా?

గు : అది నిరర్థకము. ఎంతటి మూఢుడైనా చెయ్యడు. "ప్రయోజనమనుద్దిశ్యనమందోపిప్రవర్తతే" (ప్రయోజనం కొరక మూఢుడైనా ఏ పనీ చేయడు) అనే న్యాయం ఉన్నది. స్వాభావికమంటే సరిపోతుందా?

శి : ఎందుకు సరిపోదు?

గు : శ్రుతిస్మృతులకు విరుద్ధం వస్తూఉన్నది. లోక విరుద్ధమూ, పరిపూర్ణ భంగమూ కూడా అగుచున్నది.

శి : ఏలాగు?

గు : మిరపకాయకు కారంపోవుట కానము. అలాగే అగ్ని యందుష్ణత్వము పోవుటయుగానము. కనుక అవి స్వాభావికములనవచ్చు. కాని ఎరుక పోవుచున్నది. కనుక దానిని స్వాభావికమనుట లోక విరుద్ధం.

శి : అగ్నికి స్వభావ లక్షణమైన యుష్ణత్వము మణి మంత్రౌషధాదులచేత తిరోధానమై అగ్నియందు శైత్యావిర్భావము కలుగుటలేదా?

గు : అగ్నియందు శీతలత్వమున్ను జలమునకుష్ణత్వమున్నూ మధ్యలోచినా మధ్యనేపోవుచున్నవి

శి : ఎరుక కూడా అంతేగదా! సుషుప్తి, మూర్ఛ తూష్ణి

భూతావస్థ సమాధులయందు లేనట్టు కనబడినను తిర్గి వచ్చుచున్నది గదా! అందుచేత స్వాభావికమని యెరుకను యెందుకనరాదు?

గు : అనరాదు. అచలం యెప్పటికీ ఒక్కటీరే. ఎరుక మళ్ళీ మళ్ళీ రాకపోకలు సాగిస్తూ ఉన్నది. కనుక స్వతస్సిద్ధమైన అచలం కాదు స్వతహా పరిపూర్ణ మొక్కటే స్వాభావికము. కనుక ఎరుకను కూడా స్వాభావికమంటే పరిపూర్ణ భంగమగును. కనుక ఎరుక ఆగంతుకమే ననవలెను.

శి : ఎందుకనవలెను? అసలే లేనిదికదా!

గు : శిష్యుని బోధ కొరకు ఆగంతుకమనియనవలసియున్నది

శి : ఆగంతుకమనగానేమి? అందుకు దృష్టాంతము లేమి?

గు : మేఘము, సుషుప్తి, అణువు, జాగ్రత యీ మొదలగునవి వాటంతటఅవి యెట్లు వచ్చిపోవుచున్నవో అట్లా వచ్చిపోవుటయే ఆగంతుకమనబడును.

శి : అవి యెక్కడవచ్చిపోవుచున్నవి? పరిపూర్ణమందేగదా?

గు : పరిపూర్ణమందు వచ్చిపోతూ ఉండునని అవివేకమువల్ల తోస్తూఉండును.

శి : తోచటానికేమి కారణము?

గు : ఎరుకే కారణము?

శి : మరి అన్ని ధర్మాలు పరిపూర్ణానికేనని, కొందరు అంటారే! అది యెట్లు?

గు : అజ్ఞానంచేతే అంటారు. తన ధర్మాలు పరిపూర్ణమందారోపిస్తారు. ఎరుక పోతుంది కనుక తనవలెనే పరి

పూర్ణం పోతుందన్నారు.

శి : ఎక్కడన్నారు?

గు : నోటితో అనకపోయినా, తానే పరిపూర్ణం అని అన్నారుగదా! ఆలా అంటే తనవలెనే పరిపూర్ణం పొయ్యేదే, అన్నట్లేగదా!

శి : ఆలా ఎందుకన్నారు?

గు : తెలియక అన్నారు. భ్రాంతిచేత అట్లా తోచింది. తోచినదే సత్యమని అనుకొని అన్నారు. ఇనుమును గూర్చి అగ్నికి సమ్మెటపెట్లు అన్నట్లు (ఎఱ్ఱగా అగ్ని వలె కనుపించు యినుమును సమ్మెటతో కొట్టుచూ వుంటేఅగ్ని నేకొట్టుచున్నాడనికురవాడంటాడుగదా!)

శి : యెందుకనవలసి వచ్చినది?

గు : అగ్ని నిష్ఠమైన లోహితమున్నూ యుష్ణమున్నూ అయః పిండ (యినుపగుండు) నిష్ఠముగ తోచినట్లు యెరుకను చూచి యిదే పరిపూర్ణమనుకొన్నారు.

శి : మరికొన్ని దృష్టాంతములు సెలవీయుండిస్వామీ!

గు : దానాన కుసుమముయొక్క లోహితము (మంకెన పూవు యెరుపు) స్ఫటికమణియందు తోచినట్లు. ఓడ నెక్కిపోయే పురుషునికి, ఆ యోడ నిష్ఠమైన చంచ త్వము, గమనము, తీరముననున్న వృక్షగుల్మాదుల యందు దోచినట్లు. అదేవిధంగా చంద్రావలోకనము చేసే పురుషునికి మేఘాల చంచలత్వము చంద్రుని యందు తోచినట్లు, భ్రాంతిచేత, యెరుకయందున్న శూన్యత్వమున్నూ చిజ్జడమున్నూ పరిపూర్ణమందు

దోచును. గతిలేనమ్మకు గంజేపానకం, అన్నసామ్యంగా అక్కడికక్కడే ఉత్కృష్టమనిపించుకొనును, కాని విచారిస్తే అవ్యాప్తి అసంభవాది దోషములు సంభవించును

శి : ఆ అవ్యాప్తి అసంభవాది దోషములేమో సెలవీయండి స్వామీ!

గు : బంగారమునకు ఏమిలక్షణమంటే పసిమి లక్షణమని చెప్పుట అతివ్యాప్తి దోషమందురు. ఏలననగా యిత్తడికి కూడా పసిమి లక్షణముంది. గనుక బంగారానికి పసిమి లక్షణమంటే అతివ్యాప్తి దోషము వచ్చును. గోవుకు నీలత్వము చెప్పుట అవ్యాప్తి దోషము. ఏలననగా యింకొక చోట పీత గోవులు శ్వేతగోవుంబ గావు దీనిని అవ్యాప్తి దోషమందురు. అసంభవ దోషమనగా- "వంధ్యా కిం వా లక్షణం?" అని ప్రశ్నిస్తే పుత్రి లక్షణము చెప్పుటయే అసంభవదోషము. పుత్రుడుంటే వంధ్య ఎట్లా అవుతుంది?

యీ మూడు దోషములు పరిపూర్ణమందు లేవు.

శి : యెట్లు లేవు?

గు : పరిపూర్ణమనేది రెండోదానియందు లేదు. కనుక అతివ్యాప్తి లేదు. ఏతీరు చెప్పితే ఆతీరేగాని మూడు కాలాలయందు మరొక తీరుకాదు గనుక అవ్యాప్తిన్ని లేదు. అనంతమై అచలమై స్వతస్సిద్ధమై యున్నది. కనుక అసంభవంకాదు.

శి : ఐతే యెరుకయందీ దోషములున్నవా? యెట్లున్నవి?

గు : స్వప్రకాశత్వమున్ను సర్వగోచరత్వమున్ను ఎరుక

లక్షణములు. ఐతే, దేహమందూ, కళాస్వరూపమై, తనయందు ఒక చోటనున్నట్లు ఒకచోట లేనట్లు అనేక రూపాలు అంతర్బహిస్సులయందు గానవస్తూవున్నవి. కనుక అతివ్యాప్తి ఉన్నది.

శి : బహిస్సు భేదమేగాని అంతర్భేదము లేదే? మరిన్ని బాహ్యాభ్యంతరములు అదే అయినదిగదా!

గు : ఆలాగైనా భేదమే యున్నది. ఒకచోట గుర్తెరగడమున్నూ, ఒకచోట గుర్తెరుగకపోవడమున్నూ ఉన్నది మరిన్ని ఆధారమందొకరీతిగా; హృదయమందొకరీతిగా భ్రూమధ్యమందొకరీతిగా; కనక విద్రుమ స్ఫటికచ్ఛాయలతో వేర్వేరుగా కాన వస్తూవున్నది. కనుక అవ్యాప్తిన్ని కలదు. సర్వానా అది లేనేలేదు. కనుక అసంభవమున్నూ కలదు.

శి : యిన్ని దోషములున్నా ఎరుకే పరిపూర్ణమని ఎందు కనుకున్నారు స్వామీ?

గు: కామెర్ల నేత్రములుగల వానికి జగత్తంతా పచ్చగా దోచినట్లు పరిపూర్ణము తెలియని అజ్ఞులకు ఎరుకే పరిపూర్ణముగా దోచును. కానవచ్చినా ఎరుక పరిపూర్ణముతో సమానము కాదు.

శి : ఎందువలన?

గు : పరిపూర్ణత్వము యెరుకయందు లేదు ఎరుక యొక్క శూన్యత్వము, పరిపూర్ణమందు లేదు. కనుక రెండూ సమానము కాదు.

శి : అద్వైతవాదులు ఎరుకే బ్రహ్మమవుతుందన్నారు.

గు : మునుపు తాను కానట్టున్నూ యిప్పుడు జ్ఞానం చేత క్రొత్తగా అయినట్టున్నూ అన్నారు. కానివస్తువు కానేకాదు. ఐనవస్తువు కాకనూపోదు. ఎరుక, బ్రహ్మ మెట్లా అవుతుందన్నారు?

శి : హరిదచూర్ణమందు తూర్ణంగలసి (పసుపులో సున్నం కలసి) రక్తవర్ణ మేర్పడినట్లుగా ఎరుక బ్రహ్మమవుతుందని కాబోలు వారి ఉద్దేశము.

గు : హారిద్రచూర్ణము తూర్ణము కలసి రక్తవర్ణమైనట్లు ఎరుక దేనిని గూడి బ్రహ్మమైనది? మరిన్ని రెండు వస్తువులు చెపితే అద్వైతానికే హాని. మరిన్ని యీ దృష్టాంతము చేత బ్రహ్మమునకు జన్యత్వము చెప్పినట్లుగూడా యగుచున్నది. కనుక అట్లా చెప్పనేకూడదు యిట్లు చెప్పుటలుగూడా యెరుక వికారము లే.

శి : యెట్లు చెప్పవలెను?

గు : ఉన్నది ఉన్నట్లు తెలిసితే తెలివి నిలువదు. ఉన్న పరిపూర్ణము సర్వకాలాలయందూ ఉన్నది, కనుక కాల భేదము లేదు. సర్వదేశాలయందు ఉన్నది. గనుక దేశ భేదములేదు. సర్వవస్తువులయందూ ఉన్నది. గనుక వస్తుబేధములేదు. యీ త్రివిధ బేధములు శూన్యమైనదే పరిపూర్ణము.

శి : ఈ బేధములు యెరుకయందు ఏలావున్నవి?

గు : ఒక దేశమందు స్త్రీ పురుషులొక తీరు. మరొక దేశమందు మరొకతీరు. కనుక దేశబేధము కలదు. ఒక కాలమందు స్థూలమున్నూ ఒక కాలమందు సూక్ష్మ

మున్నూ ఉన్నవి. కనుక కాలబేధమున్నూ కలదు.

శి : కాలభేదమును దృష్టాంతములతో సెలవియ్యండిస్వామీ!

గు : వేసవికాలంలో సూక్ష్మమైన మేఘరూపములో నున్న జలము వర్షాకాలములో స్థూలరూపం వహించి నదీ ప్రవాహములైనది. సృష్టికి పూర్వం సూక్ష్మరూపంలోనున్న ఎరుక స్థూలరూపమై జగజ్జీవేశ్వరరూపం వహించింది.

శి : వస్తు భేదం కూడా చెప్పండి స్వామీ!

గు : వస్తువునకు మరొక వస్తువునకు ప్రత్యక్షంగా కనుపించుచున్న భేదమే వస్తుభేదం మరిన్ని వృత్తి భేదం బట్టి ఒకే వసువునకు నామభేదములున్నూ వచ్చినవి. అనేక వృత్త్యాత్మకం గనుక స్వబేధమున్నూ కలుగుచున్నది. కనుక యిదే యెరుక. యిదే మాయ. దీనికి పూర్తిగా వేరైనదే పరిపూర్ణము.

శి : ఐతే పరిపూర్ణములో యెరుకెట్లున్నది?

గు : స్వప్నములో ప్రజలు గుట్టములు వచ్చినట్లే యెరుక పరిపూర్ణములో వున్నది.

శి : యీ బోధ యెటువంటివారికి చెప్పవలెను? (అధికారు లెవరు?)

గు : తైల బిందువు నీళ్ళలో వేస్తే నీరంతా యెట్లలుము కొనునో ఆలా త్వరగా సూచన మాత్రించే గుర్తెరిగే వానికిన్ని, నీళ్ళల్లో యిసుక వేస్తే కరిగిపోక యెలానిలచి వుండునో అట్లు ఒకసారికే దృఢమయ్యేవారికిన్ని చెప్పవలెను. బెండువంటి వానికిగాని, పాషాణంవంటి

వానికిగాని చెప్పరాదు. బెండు నీటిపై దేలుచూ ఎటుపడితే అటే కొట్టుకొనిపోవును. పాషాణంపై యెంత నీరు ప్రవహించినా లెఖ్ఖవుండదు. బోధ యెంత చెప్పినా, దాని ప్రభావం అంతఃకరణపై ఏ మాత్రం పనిచేయదు.

శి : ఎరుక సత్యము కానేకాదా?

గు : ప్రతిమకు ప్రసూతి యెంత సత్యమో ఎరుకంతే సత్యం-



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## తొమ్మిదవ ప్రకరణము

## యెరుక స్వాభావిక లక్షణములు

గు : ఎరుక సర్వతోముఖము. స్వయంప్రకాశము.

శి : సర్వతోముఖమనుట యెట్లు?

గు : జలమువలె, వాయువాకాశములవలె యెటుబడితే అటే ప్రసరించి వ్యాపించి యున్నది.

శి : ఆవిధంగా పంచభూతములవలె గానవచ్చుచున్నదా?

గు : పంచభూతములు దానిని పరివేష్టించి కోశముల (గవిశెన) వలెనున్నవి.

శి : కోశములనే పేరు యేలాగున అన్వయించును?

గు : అరటిచెట్టునకు పొరలేలాగున యున్నవో, అట్లాగే ఖడ్గమునకు ఒరె. ఫలములకు పైతొక్కలను. వున్నట్లుగా, వుండును. మరియు బూడిద అగ్నిని కప్పినట్లు, జలమును భాండము గప్పినట్లు. మేఘము సూర్యచంద్రాదులను కప్పినట్లు కోశములు ఎరుకను కప్పియున్నవన్నమాట.

శి : ఐతే, ఆ పొరలయందుగాని. ఆ పొరల బైటగాని యెరుక లేదనవలసినదేనా?

గు : ఆ కోశములు కూడా ఎరుకయేగాని ఎరుకకు భిన్నం కావు వేరుగా చెప్పినా దేహ మోహాదులు యెరుక కంటె భిన్నం కావు. పాషాణాదులయందు కఠినశక్తి భిన్నమూ అభిన్నము భిన్నాభిన్నము యేలాగున కాదో, పురుషునికంటె పురుషశక్తి ఏలా భిన్నము కాదో, నాకు శక్తి వచ్చెను, శక్తిపోయెను అన్నపుడు శక్తి ఏలా భిన్నముగా లేదో, ఆలాగే దేహేంద్రియాదులున్నూ భిన్నంకావు. నెత్తురే పాలుగా, విత్తే చెట్టుగా మారినట్లుగానే, అదే యిది, యిదే అది, అయివున్నది. ఆలాగే పురుష ప్రకృతులకు ఎరుక మరుపులకు యెంత మాత్రం భేదము లేదు.

పుణ్యపాపములు, జ్ఞానాజ్ఞానములు, బంధమోక్షములు జనన మరణము లాదిగాగల ద్వంద్వములలో ఒకదాని నధిష్ఠించి మరొకటి యుంటూయున్నది.

శి : కనకమే భూషణములైనా, మళ్లీ విలక్షణమంటూ ఒకటి వున్నదా?

గు : నామరూపాలకు విలక్షణంగా యున్నదిగాని తత్వతః ఏకమే. అన్నిటినీ అంటక వున్నట్లున్నా అంటియే యున్నది కనుక అంటక అంటియున్నదే యెరుక.

శి : దానిని పరులు యెరుగుదురా?

గు : ఏది యెరిగినదో అదే యెరుక. మూలము లేనిది. కాని సర్వమూ అదే,

శి : అది ఏలాగు స్వామీ!

గు : మృష అయినా కలలో దోచిన శరీరములు కలకంటె

యేలా భిన్నములు కావో, నత్తగుల్లలను శంఖములను విడచి ఆయా పురుగులెట్లు భిన్నంగా లేవో అట్లే.

శి : మూలము లేదంటిరి. మూలం లేదన్న చో ఏమి సిద్ధించును?

గు : మూలము లేని ఎరుకను సర్వదా అభావ మనవలెను.

శి : ఎరుక భావరూపముగా కూడ గానవచ్చుచున్నదే!

గు : అదే లేదు కనుక దాని భావాభావములు దానితో నేపోయె ను అందుకే ఆ స్థితినే ద్వయదోషరహితం అన్నారు. ఉపాధిద్వయ రహితమన్నారు. అది వూరికే అబ్బదు. సాంప్రదాయకముసరిగా తెలుసుకోనకున్న చో అయ్యవారిని చేయబోతే కోతి అయినట్లు అవును.

శి : కొందరీభావమును దూషించుచున్నారే!

గు : సాంప్రదాయము ఎరిగితే తెలియక దూషిస్తారు కాని కాకులు శపిస్తే మేకలు చస్తవా? అట్లే వివేకులైన వారు చెడరు.

శి : మరి యిక చెడిపోయేదెవరు?

గు : వారే చెడెదరు. వైష్ణవులిద్దరు కూర్చొని భోజనం చెస్తూవుండగా ఒకని అన్నములో ఒక రాయివచ్చెను ఆ సంగతి రెండవ వానితో చెప్పగా ఆ రెండవవాడు కొరకరా! గట్టిగా కొరుకు! ఒక లింగం పోయినా పోవుటయే అన్నాడట. మొదటివాడా రాతిని ఘట్టిగా కొరుకుటలో పండ్లు విరిగి నోరువాచెను. కాబట్టి వాడే చెడెను.

శి : మహాత్ములను దూషించవచ్చునా?

గు : దూషిస్తే ఆ మహాత్ముల కేమిభయం? భయము తీరిన

వారికేమి భయము? చెరువులో పరుపుబండయున్నది. చెరువులోనికి ఎంతజలంవచ్చినా పోయినా ఏకస్థితిగా ఏలాగున వున్నదో ఆలాగే

శి : బయలు బయలు, అని బహిరంగంగా చెప్పుతూంటే నాంప్రదాయం ఎందుకు తెలియరాదు.

గు : బయలు బయలు, అనుకొన్నంత మాత్రమున అది లభించదు పైగా వాడు చెడిపోవుట సత్యం.

శి : అది ఏలాగు?

గు : బిక్ష్యాం వండుకొని తింటే ఆకలి తీరునుగాని వడ్లుతింటే కడుపు నిండునా! పైగా కడుపునొప్పి పుట్టును. కనుక యెరుక యెటువంటిదో విచారించి పరిపూర్ణమును తెలిసికొని గురువాక్యంరీత్యా లేకపోవలె. యిదే రాజ మార్గము.

శి : కొందరు యెరుకే బ్రహ్మమని వాదించుచున్నారే.

గు : అవును. యీ రాజమార్గమును సమర్మకముగా తెలుసుకొనకుండా యెరుక మార్గమంతో నిలచి సిగ్గయినా లేకుండా ఆ యెరుకే బ్రహ్మమని వాదించెదరు.

శి : సిగ్గెందుకు?

గు : కుళ్ళిపోయి పురుగులుపట్టిన గాడిద కళేబరములోని మాంసమును శక్యములను హేయబుద్ధిలేక భోజనములు చునేయుండును. అట్టిడికి దేవేంద్రుడంతటి వాడు వచ్చినా మహానుభావులు వచ్చినారని సిగ్గులేక భయపడక దానిపనియందే అది వుంటూవుండును. దాని స్వభావము వీడలేదు పునీకి పంచభక్ష్య భోజ్య

ముంలు పెడితే దాని దుర్గంధమెట్లుపోదో, వేపవిత్తును వేసి పాలుపోసి పెంచినా దాని చేదు యేలాగున పోదో, నెమలిపింఛములోని కన్నుల శృంగారము స్వత స్సిద్ధముగా యెట్లులిగెనో అట్లే గుణదోషములు సహజంగా రావలెను.

శి : యీ మార్గము అందరికీ సూచనచేస్తే నేమి?

గు : భ్రాంతివుంటే సూచన చేయరాదు. చేస్తే అది విరోధమగును. కడుపునొప్పి పుట్టినవానికి అన్నము పెడితే విరోధమైనట్లు, జ్వరము వచ్చినవానికి రోగము హెచ్చయినట్లు, కామెర్లవాని కండ్లకు తెల్లని శంఖముకూడా పచ్చగా గానవచ్చినట్లు విరోధమేౘను గాడిదమీద బంగారం తీసుకొనివెళ్లినా బంగారం విలువ దానికి తెలియనట్లు, బధిరునికి శంఖారావము, జాత్యంధునికి రత్నపరీక్ష, వంధ్యకు ప్రసూతిశ్రమ షండునికి స్త్రీ సంగమ సుఖము ఏలాగున తెలియదో ఆలాగే భ్రాంతియుతునకు యీ బోధ స్వాస్వ్యము తెలియజాలదు. సముద్రములో మునిగినవానికి ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరములు తెలియనట్లే, అజ్ఞాన సముద్రములో మునిగినవానికిన్ని ఆలాగే.

శి : అయ్యా— యిట్టి దోషము తెలుసుకొనేవానియందున్నదా లేక తెలియబడేదానియందున్నదా? (ప్రమాతృదోషమా? ప్రమేయదోషమా?)

గు : దోషము రెంటియందూ నున్నదే. రెంటియందునున్న ఎరుక ఒక్కటేకదా! ఎరుకకు తోచడమనేది, చెర

కాకు తీపి వేపాకునకు చేదున్నవలె, స్వాభావికమే.

శి : యీ స్వభావము పోవుమార్గమేమియు లేనే లేదా?

గు : దానితోనే గాని అదిపోదు. మేలుకొంటే లేనేలేదు. కనుక పోవడమనేదీ లేదు.

శి . ఎరుక స్వాభావిక లక్షణము లేవి?

గు : విన్నదీ, కన్నదీ, అన్నదీ మూడూ ఒక్కటే. అగ్ని యందు లోహిత. ఉష్ణ ప్రకాశములు ఏలాగో, జలమందు శ్వేతశైత్య ద్రవత్వములు ఏలాగో ఆలాగే.

శి : ఇవి యెట్లు రహితం కాగలవు?

గు : గురుకృప వడసినచో ఏమీ లేవు. తనతో కూడా ఏమీ లేదు. తెలతెలవారితే చీకటి వెలవెలపోయినట్లు విభుడువస్తే విరహం పోయినట్లు, సుఖంవస్తే దుఃఖము పోయినట్లు పోతాయి. తమస్సు సూర్యుని చూచినట్లే. తానే లేకపోవును.

శి : పోతే?

గు : స్వచ్ఛమై, నిరాకారశూన్యమై, సమస్తమైన దిక్కుల యందు ఎడ తెఱపిలేకుండా అహోరాత్రస్య ఏకరీతిగా ఏది తెరిపిలేక నిండినిబిడమైయుండునో అదేయుండును దానిని తెలిసి, తెలిపినవారే గురువులు యింతకంటె అధికము లేదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పదవ ప్రకరణము

## యెరుక స్థానము - ఏకిదేశీయత

గు : స్థానస్వరూప స్వభావములను గుర్తెరిగినవారికే బోధ మర్మము తెలియును.

శి : బ్రహ్మమునకు స్థానమంటూ ఒకటి వేరేవున్నదా?

గు : ఎరుకకే స్థానస్వరూప స్వభావములున్నవిగాని పరిపూర్ణమునకేమీ చెప్పరాదు.

శి : ఎరుక సర్వాధారము, అఖండ చిత్స్వరూపము, అదే బ్రహ్మమని చాలామంది వాదిస్తున్నారే! పోనీ దానికి స్థాననిర్ణయ మన్నారు. అదెట్లో సెలవియ్యండిస్వామీ!

గు : "నీవారశూకవత్తన్వీ పీతాభాస్వచ్ఛనూపమా. తస్య శిఖాయాముధ్యేపరమాత్మా వ్యవస్థితః" అని చెప్పబడింది. ఇట్టి యెరుక హిరణ్మయ కోశమందున్నదని చెప్పబడుతోంది. "హిరణ్మయే పరేకోశే సతతం బ్రహ్మతిష్ఠతి" అనీ! హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మ నిష్కలం" అనీ, కొనియాడబడింది.

శ్రుతి : సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ యోవేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్" అనీ "ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి" అని భగవద్గీత

యందునూ చెప్పబడింది. ఇట్టి యేకదేశ లక్షణము చెప్పబడ్డ యెరుక పరిపూర్ణ పరబ్రహ్మ మెట్లగును?

శి : సగుణంలో ఏక దేశీయ మేకానినిర్గుణంలో సర్వవ్యాపకం

గు : ఓహో! యిదిమరీ బాగుంది. సగుణ నిర్గుణ రూపములు రెండుగా మార్పుపొందుచూ వుండేది, మాయేయగును గాని పరిపూర్ణ మెట్లగును? అది సర్వవ్యాపకమైన బ్రహ్మమే అయితే దానికొక స్థానము, రూపము, గుణము, ధర్మము లుండునా" గుణరూప ధర్మకర్మము లున్నది, బ్రహ్మ మెట్లగును?

శి . సూర్యుడొకచోట నున్నప్పటికీ, విశ్వమంతా ప్రకాశింప చేసినట్లుగా బ్రహ్మము దహరాకాశమందుండి సర్వమునందు ప్రకాశమానంగా వ్యాపకమై, సర్వమును ప్రకాశింప చేయునని వేలచెప్పరాదు?

గు : బ్రహ్మము సూర్యునివంటిదా? సూర్యుని కేదైన అడ్డమువస్తే ఆతని ప్రకాశముకూడా నడ్డగింపబడుట లేదా? ఎక్కడుంటే అక్కడ ప్రకాశిస్తాడుగాని సర్వత్రా ఏక కాలమందు ప్రకాశిస్తాడా? ప్రకాశించడు కనుకనే మనకు సూర్యాస్తమయంతో చీకటి సిద్ధమవుతోంది. వేడి, వెలుగుగల సూర్యుని ఎప్పుడైన నిర్గుణం అని చెప్పగలమా? మీ సూర్యదృష్టాంతం ఎరుక కే అన్వయిస్తుంది గాని పరిపూర్ణమున కెంతమాత్రం ఏ విషయంలోనూ సాటి చెప్పరాదు.

శి : జ్ఞానమే బ్రహ్మమని శృతులన్నీ చెపుతూవుంటే మేము చెప్పినామంటారేం స్వామీ!

గు : శ్రుతులు పారమార్థికముగా "ఓ. న, మ"లు రాని వారికి కూడా క్రమంగా బోధించ సమకట్టి అట్లు చెప్పినవి. అన్నమే బ్రహ్మము, ప్రాణమే బ్రహ్మము, వాక్యే బ్రహ్మము అని చెపుతూ పోలేదా?

శి : జ్ఞానము బ్రహ్మము కాదని ఏమి రెండు కంటారు?

గు : జ్ఞానము బ్రహ్మమైతే, సుషుప్తియందా జ్ఞానము నశించినది, కనుక బ్రహ్మమునకు నాశనము చెప్పాలి. ఆ జ్ఞానము మళ్ళీ వస్తే బ్రహ్మము తిరిగి పుట్టినదనాలి.

శి : వచ్చిపోయేది మనస్సుగాని, జ్ఞానముగాదు, జ్ఞానము పోవుటలేదు. సాక్షిగా నుంటూనే వున్నది.

గు : తెలిసినవారికి జ్ఞానమనస్సులు రెండూ ఒకటే. జ్ఞానము, మనస్సు జ్ఞప్తి, ఆత్మ, జీవుడు ఈశ్వరుడు, పరివస్తువు అంతా జ్ఞానమే.

శ్రుతి : చిన్మాత్రం బ్రహ్మవిష్ణ్వాద్యాః చిన్మాత్రం సర్వదేవతా, చిన్మాత్రం త్రిషులోకేషు, గురుశిష్యాశ్చ చిన్మయః చిదేతరం సదానాస్తియితి వేదాంత జర్ఝరః

శి : అంతా చిత్స్వరూపమే. అంతా బ్రహ్మమే నంటూ శ్రుతులు ఎందుకు చెప్పాలి?

గు : లక్ష్య లక్ష్యార్థముగా చెప్పినవి. వున్నదా పరిపూర్ణ పరబ్రహ్మమే. అనేక నామరూపాలుగా తోచే చిత్స్వరూపం ఏమీలేదు. అది లేకుంటే వున్నదేదో, అనగా ఆ జ్ఞానాన్ని విడచిచూస్తే అంతా పరిపూర్ణమే.

శి : లక్ష్య లక్ష్యార్థమును కొంచెం బాగా వివరించండి స్వామీ!

గు : నామరూపాలతో తోచే సమస్తమూ, లక్షణావృత్తిచే చూస్తే అంతా చిత్స్వరూపమే కనుక చిత్స్వరూపమే లక్ష్యార్థమైనది. లక్ష్యాలక్ష్యార్థమనగా లక్ష్యార్థమైన చిత్స్వరూపమును విడచిచూచినచో అంతాపరిపూర్ణమే కనుక పరిపూర్ణము లక్ష్యాలక్ష్యార్థముగా గ్రహించవచ్చును.

శి : ఈలాడొంకతిరుగుడుగ చెప్పకపో తేసూటిగ చెప్పరాదా?

గు : మనస్సు దానిని గ్రహించలేదు. వాక్కువర్ణించలేదు.

శి : మీరిప్పుడు వాక్యముచే దానిని చెప్పుటలేదా?

గు : లేదు. నేను దానిని గురించి చెప్పుటేలేదు. లేని దానిని గురించియే చెప్పుచున్నాను. అట్లే శ్రుతులున్ను లేని దానిని గురించే చెప్పినవి

శి : అందుకే అదే బ్రహ్మమని అందరూ మోసపోయే అవకాశం కలిగింది. అది లేనేలేదని శ్రుతులు స్పష్టం చేయకుండా ఎందుకూరుకున్నవి?

గు : అదే బ్రహ్మమని కొంతకాలం అభ్యాసంచేసినమీదట అది బ్రహ్మముకాదని వారికే నిజమైన సందేహం కలుగవలె. పెద్దలను ఆశ్రయించి అడిగి తెలుసుకొనవలె. "నాపృచ్ఛః కస్యచిద్బ్రూయాత్" అధికారియైన వాడు వచ్చి అడిగితేనేగాని గురువైనా చెప్పకూడదు. కనుక మొదట్లో అభ్యాసం కొరకు శ్రుతులుచెప్పినవి.

శి : మొదట్లోనే శ్రుతులు వున్నదున్నట్లుగా చెప్పరాదా?

గు : చంటిపిల్లవానిముందర పంచభక్ష్య పరమాన్నములు పెట్టవచ్చునా? పెట్టితే తిని జీర్ణించుకొని పుష్టిచెం

దునా? అలాగుననే పరిపూర్ణ బోధకు పూర్వము, యెరుక మార్గమవలంబించకపోతే పరిపూర్ణ బోధకు పాత్రుడు కాడు సత్, చిత్, ఆనందములు సాధకములు గాని వాస్తవములు కావు. సకల దేశములయందు సకల కాలములందు సమస్తమైన వస్తువులయందు చలించక వున్నదేదో అదే పరిపూర్ణ పరబ్రహ్మము కాని జ్ఞాన స్వరూపమైనది కాదు.

శి : జ్ఞానముకంటె ఆనందము గొప్పదనికొందరంటున్నారు. పోనీ ఆనందమే బ్రహ్మముగునా?

గు : ఆనందముకంటెనూ జ్ఞానమే యెక్కువది. ఆనందము జ్ఞానమువలననే పుట్టినది. జ్ఞానము లేకుంటే ఆనంద మును గుర్తించేది ఆనందించేది మరేముంది? కనుక జ్ఞానమే గొప్పది.

శి : జ్ఞానమే ఆనంద స్వరూపము. కనుక జ్ఞానరూపమైన ఆనందము తన్నుతానే గుర్తించి తనకు తానే ఆనం దించునని చెప్పకూడదా?

గు : అంతా చిత్స్వరూపము. ఆనందరూపము. అట్టి చిత్తు (లేక జ్ఞానము లేక తెలివి) బ్రహ్మమే అయితే, దానిని గుర్తించుటకు మరేమున్నది? వున్నదది ఒక్కటేగదా! కన్నులు అన్నిటిని చూచునే గాని తమ్ము తాము చూచుకోలేవుగదా! చూచేది చూడబడేది ఒకటై పోతే చూపే లేదు.

శి : జీవుడు, ఈశ్వరుని గుర్తెరుగుచున్నాడని కొందరంటు న్నారు గదా?

గు : జీవుడే స్వరూపుడు? ఈశ్వరుడేస్వరూపుడు? గుర్తించేది ఏస్వరూపము? చూచేది ఏమి? చూడబడేది ఏమి? తెలుసుకొంటే అంతా భ్రాంతి కల్పితమే.

శి : యోగుల హృదయమందు ఈశ్వరుడున్నాడని సహస్రార మధ్యమున (జ్యోతి), లేక ఆత్మస్వరూపమున్నదనీ, దానిని గుర్తెరిగి ఆనందమగ్నులవుతారనీ యిట్లనేకులు యోగాభ్యాసం జపతపాది సాధనలు చేస్తున్నారుగదా?

గు : ఎటుకటు మాత్రమే స్థానం అంటూ చెప్పాలి కాని, పరిపూర్ణమునకొక స్థానమంటూ చెప్పరాదని మొదట్లోనే చెప్పేనుగా!

శి : సుఖదుఃఖములనుభవించేవాడు జీవుడని, వానికతీతుడు ఈశ్వరుడనీ (బ్రహ్మమనీ) అంటున్నారు. అట్టి బ్రహ్మము పొందదగినది కాదా!

గు : జీవుడా బ్రహ్మకు భిన్నుడా? అభిన్నుడా? "సఏవ మాయా పరిమోహితాత్మా, శరీరమాస్థాయకరోతి సర్వం। స్త్రీ అన్నపానాది విచిత్రభోగైః సఏవజీవ స్వపితి ప్రబుద్ధః స్వప్నేపి జీవస్సుఖదుఃఖ భోక్తా స్వమాయయా కల్పిత విశ్వలోకే" అంటూంది కైవల్యోపనిషత్. తన మాయాశక్తికి తానే వశుడై లోకములను, దేహములను కల్పించి జీవుడై శరీరంలో ప్రవేశించి జాగ్రత స్వప్నసుషుప్తులు పొందుతూ, పుట్టుచూ చచ్చుచూనుండేవానిని బ్రహ్మమనదగునా?

ప్రపంచానికి మూలమై, ప్రపంచంచే మోహితమైన యెరుక ప్రపంచముకంటె భిన్నమనవచ్చునా? ఇట్టి మాయా రూపమగు యెరుకే బ్రహ్మమన జెల్లునా? ఆకాశము క్రిందకి కూలిపోయిందని ఒకడంటే చూద్దామని మూర్ఖులందరూ పరుగెత్తినట్లుగానున్నది. దునక ఈనిందంటే దూడ మగదా లేక ఆడదా? చూద్దామని పోయినట్లున్నది.

శి : ఆ బ్రహ్మము నీలోపల వున్నది. బైట వెతుకుతా వెందుకు? దానిని గుర్తెరుగుమంటారు కొందరు. అదియు నబద్ధమేనంటారా?

గు : ఆ బ్రహ్మము నీలోపలే నున్నదంటే, మరల ఏకదేశీయతా దోషం సంక్రమిస్తోంది. వస్తునిర్ణయము తెలియని అజ్ఞానమే యీ నిర్ణయాలకు కారణము.

శి : అంతఃకరణాధిష్ఠాన చేతనము జీవుడని, మాయాధిష్ఠాన చేతనము యీశ్వరుడనీ అంటారు కొందరు. మీరే మంటారు?

గు : అంతే అనుకోనీ, నీవు మోసపోకు. మాయ, యేస్వరూపము? అంతఃకరణం యే స్వరూపము? అధిష్ఠానం యే స్వరూపము? అది ఏ స్థానమందుండి ఏ స్థానమున ప్రతిబింబించెను? అనివిమర్శించు, నిజము తేలుతుంది,

శి : అంతటి విమర్శనాజ్ఞానము నాకుండవద్దా!

గు : గురువు నాశ్రయించి వస్తునిశ్చయము పొందు, ఆ విధంగా గురుకృపకు పాత్రుడవైతే సర్వం తెలియబడుతుంది? ఆపైన ఏ శాస్త్రాలు చదివినా నిన్ను భ్రాంతిలో ముంచవు.

శి : అట్టి సద్గురువు దొరకాలిగదా?

గు : నీ పూర్వపుణ్యముచేతనే సద్గురువు దొరకాలి.

శి : ఆ గురువెట్టివాడు అయివుండాలి?

గు : ఎరుక పరిపూర్ణముల, నేర్పాటుగా దెలిపి ఎరుకను మాన్పించే పరిపూర్ణబోధ గురువే కావాలి. అతడే భ్రాంతిలేని మార్గం నీకు తెలియచేస్తాడు.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పదకొండవ ప్రకరణము

## దృగ్ నిరసన

గు : పరిపూర్ణమును తెలియక చిత్ స్వరూపమైన దృక్కే బ్రహ్మమని అన్నారు.

శి : యిందుకు శ్రుతిప్రమాణము కలదా?

గు : కలదు. "కూటస్థ బహ్మా, జీవేశయిత్యేవంచ. చతుర్విధం చిదేతరం సదానాస్థి చిత్ స్వరూపం జగత్రియం" కనుక దృక్కే బ్రహ్మమన్నారు.

శి : ఈ దృక్కే బ్రహ్మమా?

గు : ఈ దృక్కు బ్రహ్మముకాదు. సర్వదృక్కు వేరేవున్నదని అన్నారు. ఆ దృక్కును వివరించండి స్వామి!

గు : రూపము దృశ్యమైతే కన్ను దృక్కు, కన్ను దృశ్యము అయితే మనస్సు దృక్కు మనస్సు, బుద్ధి వృత్తులుకూడ దృశ్యమైతే వానికి సాక్షే దృక్కు ఈ సాక్షి దృశ్యముకాదు. దానిని సర్వదృక్కన్నారు,

శి : సాక్షి ఎందువలన దృశ్యముకాదు,

గు : ఈ సర్వదృక్కును గుర్తెరిగేది దృక్కుకంటె అన్యమందువా? లేక దృగంశమైన దృక్కు దృక్కును గుర్తెరుగునందువా?

శి : దృక్కు కంటె అన్యమైనదే దృక్కును గుర్తెరుగునంటె మాత్రం బాధయేమి?

గు : దృక్కున కన్యమైనది దృశ్యమంటున్నారు. దీపముచేత ప్రకాశింపబడ్డ ఘటాదులు, దీపమునే ఎట్లు ప్రకాశింపచేయనేరవో, అలాగే దృక్కుచేత ప్రకాశములైన దేహేంద్రియ మనఃప్రాణములు దృక్కును గుర్తింపజాలవు.

శి : ఎందుచేత?

గు : దృక్కు అనగా చిత్ స్వరూపముకదా! తదన్యము జడము కదా! జడము దృక్కును గుర్తెరుగునా?

శి : పోనీ, దృగంశమైన దృక్కు దృక్కును గుర్తెరుగునని చెపితేనేమి?

గు : సూర్యాంశమైన దీపము సూర్యుని ఏలాగున ప్రకాశింపచేయనేరదో అలాగే గుర్తెరుగదు.

శి : రత్నము. తత్ సదృశ్యమగు వేరే రత్నమును, ప్రకాశింప చేయుకూడదా?

గు : చిత్ స్వరూపమునకు సదృశమగు అన్య చిత్ స్వరూపము లేదు.

శి : తమ భావము విశదీకరించండి స్వామీ!

గు : వేదాంత శాస్త్రములందు చిన్మయము చెప్పలేదు. చెప్పరాదు, కనుకనే చెప్పలేదు.

శి : ఎందుచేత చెప్పరాదు?

గు : ఒక చిత్ స్వరూప చైతన్యముకంటె ఉత్కృష్టమైనది

మరియొకటివుండి చూస్తూవున్నదని అంటే, ఆ దృక్కున్నూ యింకో దృక్కుచేత దృశ్యమగును ఈలాగున పరంపర సంబంధముచేత దృక్కులు అనంత సంఖ్యాగా పెరిగిపోవును. అందుచేత సర్వదృక్కైన ఆత్మకు అనవస్థాదోషము వచ్చును.

శి : కొన్ని దృక్కులను వూహించి అందు ఒక దృక్కును నిలిపి అటుపైన దానికి దృష్టలేదు అని, చెపితే సరిపోదా?

గు : కొన్ని దృక్కులు పరంపరగా నిర్ణయించిచెప్పి ఆపైన దృక్కు లేదంటే వ్యభిచారదోషమున్ను వచ్చును. "ఏకమేవా ఽద్వితీయం బ్రహ్మ" అని శృతి వున్నది. కనుక బ్రహ్మద్వయము చెప్పరాదు. బ్రహ్మమన్న చైతన్యమన్న దృక్ అన్న ఒకటే కనుక దృక్ ద్వయము చెప్పకూడదు.

శి : దృక్కు అంతయు ఏకమే. కనుక మొదటి వెలుగైన ప్రథమ దృక్కే బ్రహ్మము అని చెపితే సరిపోతుంది గదా!

గు : గోడ చాటైతే గుర్తించదుకదా! చలనాత్మకంకదా! సమస్త భ్రాంతులుపొందించునుకదా! సుషుప్తియందు ఏమి గుర్తించదుకదా! సర్వాధిష్ఠానమైనప్పటికినీ పాదరసమువలె పరుగులాడుచున్నదిగదా! కనుక అట్టి దృక్కు బ్రహ్మముకాదు.

శి : అయితేమరి, యోగులగువారు దూరదృష్టి దూరశ్రవణాది మహత్తులు సాధించి చూస్తూ చెబుతూవుండుట

లేదా? మరియున్నూ తెలివి, జాగ్రిత్ స్వప్న సుషుప్త్యాది అవస్థలన్నిటిని గుర్తించుటలేదా? అంతే కాకుండా కాలత్రియమునందూ వున్నదికదా! అది బ్రిహ్మము ఎందుకు కాజాలదు?

గు : సాధనాంతర నిరపేక్షకమైనదే బ్రిహ్మము. యోగము సాధనాంతరము కనుక ఏకదేశమందు, యోగముచేత గుర్తెరిగితే బ్రహ్మత్వము సిద్ధించదు. సుషుప్తిలోనుంచి మేలుకొన్న పిదప సుషుప్తిని పొందినానని చెప్పినదే కాని సుషుప్తిలోనున్నపుడు చెప్పలేదు. ఒక అవస్థయందు గుర్తెరుగని జ్ఞానము బ్రహ్మముకాదు.

శి : సవికల్పదృష్టి అనిన్ని, నిర్వికల్పదృష్టి అనిన్ని రెండు విధములు చెప్పి. అందులో నిర్వికల్పదృష్టే బ్రహ్మమనీ, సవికల్పదృష్టియే మనస్సనిన్ని పెద్దలు అన్నారు. నిర్వికల్పదృష్టి నిత్యము. సవికల్పదృష్టి అనిత్యము అని చెప్పుచున్నారు.

గు : సవికల్ప, నిర్వికల్ప విచారము చేసేది యేది?

శి : మనస్సు

గు : జడమైన మనస్సుకు యింత ప్రాముఖ్యమెక్కడిది?

శి : మనస్సునకు ఆ సత్తావున్నది.

గు : మనస్సునకు సత్తావున్నదని చెపితే సత్తా ద్వివిధమగుచున్నది. వేదాంతశాస్త్రములయందు సత్తాద్వయము అసంభవము.

శి : మనస్థమై (అనగా మనస్సునందునిలచి) నిర్వికల్పదృష్టే సర్వము చూచుచున్నదని ఎందుకనరాదు?

గు : అట్లా చెప్పితే నిర్వికల్పదృష్టికి కర్తవ్యము వస్తూన్నది మరిన్నీ అట్లా నిర్వికల్పదృష్టియే చూచుచున్నదని అంటే, సుషుప్తి మూర్ఛలయందు ఎందుకు చూడదు?

శి : ఇంతకూ సవికల్పము నిర్వికల్పము అను రెండునూ వున్నవా? లేవా?

గు : విత్తే చెట్టు; చెట్టే విత్తు. అలాగే సవికల్పమే నిర్వికల్పము. నిర్వికల్పమే సవికల్పము. నిర్వికల్పముండగా సవికల్పము పుడుతుంది. సవికల్పము వుండగా నిర్వికల్పము తోచింది. రెండూ ఒకటే. ఒకటి లేకుంటే రెండూ లేవు. యిదే దృఢము.

శి : మనస్సు దేశదేశాలకు పోతూవుంటే మధ్యమధ్య సవికల్ప నిర్వికల్ప శూన్యమై, నిస్తరంగ సముద్రవత్తుగా సంవిదూరిపమైవున్న దృష్టియే బ్రహ్మము అని కొందరు అంటున్నారు. పోనీ అది అంగీకరించవచ్చునా?

గు : అది బ్రహ్మమని ఎవరికి తోచెను? సవికల్పమే నిర్వికల్పమును గ్రహించెనా? సవికల్పమే నిర్వికల్పమును గ్రహించెనని చెపితే, అపుడు సవికల్పమే దృక్కు, నిర్వికల్పమే దృశ్యం అగును. కనుక అలాగున అనరాదు.

శి : సవికల్పమే దృశ్యము, నిర్వికల్పమే దృక్ అనిఅంటేనో?

గు : దానివంటిది అయితేనేగాని దానిని గుర్తెరుగదు. విద్యావంతులను విద్యావంతులుగాని గుర్తెరుగరు. అంతకంటె చలనాత్మకమైతేనేగాని దానిని గుర్తెరుగదు.

శి : ఈ దృక్కు దృశ్యములలో వచ్చిపోయేదివది? మాయ ఏది?

గు : దృక్కే పోయేది, వచ్చేది. దృక్కే లేకుంటే దృశ్యము కనే లేదు. దృక్కే మాయ. అంతకంటె మాయ అసలే లేదు.

శి : ఇందుకు ప్రమాణమేమి?

గు : శ్రుతి : దృశ్యరూపంచ దృగ్రూపం సర్వంశశవిషాణవత్ అనివున్నదికనుక దృక్కైనచిత్స్వరూపమే బ్రహ్మము అని చెప్పబడును. ఈ మార్గము తెలియకుంటె రాకడపోకడలు తప్పవు రాట్నము తిరిగినట్లును, బండిచక్రము తిరిగినట్లును, దిన, వార, నక్షత్ర, పక్ష, మాస, సంవత్సరములు తిరిగినట్లును, వస్తూ పోతూ వుండును.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పన్నెండవ ప్రకరణము

## ఎరుకరాహిత్యమనందే పరిపూర్ణనిశ్చయము

గు : ఎరుక ఏకాలమందూ లేనే లేదు.

శి : ఎక్కడా 'ఎప్పుడూ' లేనే లేదంటే ఒప్పుతుందా స్వామీ!

గు : పరిపూర్ణ పరబాహ్యమందు యెరుక యెప్పుడూ లేనే లేదు.

శి : మీ వాక్యాన్ని బట్టి యెరుక ఎక్కడో యింకొక చోటైననూ వున్నదేమో ననుకోవలసి వస్తూవున్నది. మరొక దానియందైనా వున్నదో లేదో స్పష్టం చెయ్యండి స్వామీ!

గు : ఎరుకయందు మాత్రం ఎరుకవున్నదని చెప్పవచ్చును.

శి : అంటే అర్థంకాలేదు తండ్రీ.

గు : తనయొక్క ఆవరణమునందు మాత్రమే ఎరుకవున్నది. తన ఆవరణంబైట ఎరుక ఏమీలేదు.

శి : తన ఆవరణము అంటే అది యెట్లావుంటుంది?

గు : దేహేంద్రియ మనస్సులు వగైరాలే ఆవరణములు అవి లేకుంటే ఎరుక పనిచేయలేదు?

శి : యివన్నీ మరణంతో పోయేవేగదా! అప్పుడెరుక యెక్కడుండును?

గు : అప్పుడు పరిక్రృత్యావరణము నంటుంటును.

శి : ఆవరణం లేకుంటే యిక యెరుక వుండనట్టేనా? ఎట్లో కొన్ని దృష్టాంతములు చెప్పండి స్వామీ!

గు : వరికాశావరణము లేని దీపముండనట్లు, బెల్లపుగడ్డలేక తీపికి వునికి లేనట్లు, ఆవరణ లేక యెరుక వుండదు. వృక్షమున కావృతమము తీసివేస్తే వనమునేది లేనట్లు; ఒక్కొక్క యిల్లు తీసివేస్తే గ్రామముండనట్లు; పపార కాపార వొలిచివేస్తే అరటి స్తంభం వుండనట్లు, మానసేంద్రియ దేహ సంఘాతమునకే యెరుకని పేరు అవి లేకుంటే ఎరుకయున్నా లేదన్నమాట.

శి : మనస్సు పోయినా ఎరుక వుండునంటారే కొందరు?

గు : వున్నది అంటే, మనస్సు పోనేలేదన్నమాట. సూర్యుడు వుంటే కిరణములు పోవునా? మనస్సు పోయినదను కొన్నారేగాని, అది యింకా సూక్ష్మ స్వరూపమై దాని కారణమందున్నమాట. మనస్సు యొక్కమూల మును గుర్తించినపుడే యీ విషయం తెలుస్తుంది.

శి : ఎవరు గుర్తింప చేస్తారు!

గు : గురువు మాత్రమే గుర్తింపచేయగలడు. అట్లు గుర్తింప చేసిన వాడే గురువు.

శి : ఈ సిద్ధాంతమందు, జీవన్ముక్తి అంగీకరిస్తారా? లేక విదేహముక్తి నంగీకరిస్తారా?

గు : రెంటినీ అంగీకరించరు.

శి : ఎందుచేతనో వివరించండి స్వామీ!

గు : తానులేడు గనుక తనకు దేహములేదు. కనుక విదే

హాముక్తి అని చెప్పరాదు.

శి : జీవన్ముక్తి ఎందుకు చెప్పరాదు?

గు : లేనివాడు జీవుడూ కాడు, బ్రహ్మమూ కాడు. కనుక జీవన్ముక్తిన్ని లేదు.

శి : ఐతే ముక్తి అనేదే చెప్పరాదా ఏమి?

గు : చెప్పరాదు లేనివానికి బంధమూ లేదు మోక్షమూ లేదు. కనుక ముక్తిన్ని చెప్పరాదు. తానునుండి ముక్తిని పొందుతాడు, అన్నమాటనీళ్ళమూటమాత్రమే.

శి : మరి తాను లేకపోయిన తర్వాత ముక్తియని చెప్పవచ్చునా?

గు : తానే లేకపోయిన తర్వాత ముక్తి యెవరికి? తాను పోవటమే ముక్తి. ఆ మాటైనా ఔపచారికమే కాని వాస్తవము కాదు.

శి : ముక్తి అనిన్ని, అది ఔపచారికమనిన్ని బంధమందు చెప్పినమాటలా? ముక్తిపొందిన పిదప చెప్పినవా?

గు : నీవు లేకపోవడమే ముక్తి. లేకపోయిన తర్వాత ఏలాగున చెప్పెదవు? బంధమందు చెప్పినవే అంటే, బంధమందు వుండగా నీకు ముక్తి ఏలాగున తెలిసెను?

శి : మరి తెలియకుంటె ఎవ్వరైననూ యెట్లు చెప్పగలరు?

గు : జాగ్రితావస్తనుంచిసుషుప్తిలోనికి పోవునపుడు అనగా నిద్రవస్తూయున్నపుడు నిద్రివస్తూవున్నదని తెలిసి తర్వాత ఏలాగున ఏమీ తెలియని గాఢ నిద్రవచ్చునో ఆలాగుననే నేను లేకపోతూ వున్నపుడు లేకపోవడమే ముక్తియని తెలిసి లేకపోతాను.

శి : తాను లేకపోవడమే ముక్తియని యెందుకు చెప్పడం? సర్వసంగ భ్రాంతి రహితమే ముక్తియని చెప్పరాదా?

గు : చెప్పరాదు తాను వున్నంతవరకూ తనకు కర్తవ్యమనేదన్ని, తద్వారా భోక్తవ్యమున్నూ వుండగలదు. ఆ విధంగా కర్మబద్ధుడవుతూంటే, జీవన్ముక్తి విదేహ ముక్తులు సంభవించవు

శి : పేరు ఏ ముక్తి అయితేనేం? ఎదోముక్తి కలుగునా కలగదా?

గు : కర్తృత్వ, భోక్తృత్వములు, కర్మబంధమూ వుంటే, అజ్ఞానధ్వంసమే కాదుకదా! యిక ముక్తి ఏమి?

శి : నేను సాక్షిని సర్వస్వరూపుణ్ని అని తెలుసుకొంటే ముక్తి కాదా?

గు : తనకన్యంగావున్న దానికి కదా తాను సాక్షి. సర్వస్వరూపుడు తానే అయితే యిక దేనికి సాక్షి? ఆ రెండూ పరస్పర విరుద్ధములు కదా!

శి : అబ్ధియందు బుట్టిన ఫేన, బుద్బుద, తరంగాదులు, (నురుగు బుడగలు కెరటాలు) అని వేరేనామము లున్నా, సముద్రంకంటే ఎలా భిన్నములు కావో, ఆలాగే యీ 'సర్వ' అనే శబ్దమూ, సాక్షి అనే శబ్దమూ, "నేను" యందు బుట్టినా, అవి నాకంటే భిన్నములు కావు.

గు : ఫేనాదులు (నురుగు మొదలగునవి) సముద్రమందు అన్య రూపత్వేనా వుండటం చేతనే కదా వేరుపేర్లు కలిగినవి! ఆలాగే. సర్వంనేనటమూ, నేనులేననటమూ,

నీవు వుంటేనే అన్నావా? నీవు లేకపోతే అన్నావా? నీవు లేకుంటే లేదనేమాటయే వుండరాదు. సర్వమూ వుంటేనూ లేదని అనరాదు.

శి : మరైతే, సిద్ధాంతమేదో స్పష్టంగా తెలపియండి స్వామీ!

గు : నీవు అనేవాడవు ఎప్పుడున్నావో నీకు కర్తృత్వమున్నూ పూర్వం చెప్పిన దోషములున్నూ సంభవించును. నీవే లేకుంటే నీ కర్తవ్యాదులున్నూ ఏమీలేవు కనుక నీవు లేకపోవటమే ముక్తి. లేకపోయెనా! వాని విషయంలో ముక్తి అని చెప్పుట కూడా శశవిషాణమువలె ఔపచారికమే

శి : ఈ పరిపూర్ణబోధ యెట్లు ఆరూఢం కాగలదో ఆ మార్గములు సెలవీయండి స్వామీ!

గు : పరిపూర్ణ పరబ్రహ్మము, అంతటా నూది మోపుటకేనా సందు లేకుండ నిండి నిబిడీకృతమై యున్నదని భావించుట యొక మార్గము.

శి : అంతటా పరిపూర్ణమే అంటే, "అంతా" వుండబట్టి గదా, అంతటా పరిపూర్ణమని భావించమన్నారు. అంతటా అని చెప్పబడే ప్రదేశాలు లేకుంటే పరిపూర్ణము వుండదా?

గు : పరిపూర్ణ మనేమాట లేదుగాని, పరిపూర్ణమైతే వుండనే వుండును.

శి : అంతటా అన్నిటా పరిపూర్ణమని అంటే, అనేక దేశాలు (ప్రదేశాలు లేక స్థలములు) అనేక వస్తువులు కూడా

పరిపూర్ణంతో పాటు వున్నట్లే గదా!

గు : నిజమే. అప్పుడు అన్నీ పోయేవే కనుక వాటితో పాటే పరిపూర్ణం అనేమాట కూడా పోతుంది అనవలసి వస్తుంది. పరిపూర్ణం తప్ప యెప్పుడూ ఏమీ లేదు. కనుక ఏమీ కాని తనయందే ఇతర మేమీ లేని పరిపూర్ణం యెప్పటికీ వుంటుంది. కాని వుంటుందని చెప్పేయెరుకే వుండదు.

శి : అంతటా పరిపూర్ణమే అని భావించుమని ఒక మార్గం చెప్పినారు. రెండవ మార్గం కూడా చెప్పండిస్వామీ

గు : కనపడే సర్వమూ తోచబడే సమస్తమూ తన గుర్తుతో సహా ఏమీ లేనే లేదని భావించడం రెండో మార్గం. వున్నది, వుండనూచుకొని వూహుకొనుట ఒక మార్గం. లేనిది లేదని లేకపోవడమే రెండో మార్గం.

శి : సరే కాని స్వామీ, యెరుక ముందు వచ్చిందా? దేహము ముందు వచ్చిందా? లేక రెండూ కలిసియే వచ్చాయా?

గు : ఎరుక ముందు వచ్చినది అనరాదు. ఏలనన దేహము లేని (ఆవరణము లేని) ఎరుక వుండదుగదా! దేహమే ముందు వచ్చినదనీ అనరాదు. స్థూలమగు దేహమునకు కారణము సూక్ష్మమగు ఎరుకయే, అయి వున్నట్లుగా తెలియబడుచున్నది. విత్తనము లేని వృక్షముండజాలదుగదా!

శి : ఐతే రెండూ కలిసియే బీజవృక్షములవలె ఒకేసారి వచ్చినవనే అనవలసి వుండును. యదార్థమేమో తెలపండి స్వామీ!

గు : ఎరుక దేహములు రెండూ వేరు కానేకావు. రెండూ కలసి ఒక్కటే. దానిని ఎరుకన్నా దేహమన్నా యీ రెంటిలో ఏ పేరున పిలిచినా ఒకటే.

శి : మరి యెట్లా చెప్పాలో తమరే తెలపీయండిస్వామీ!

గు : తనంతట తానే యోచనతోచి, దానికదే చలించి, భ్రాంతిచేత అనేకము, వచ్చినట్లు, వున్నట్లు, పోయిన ట్లుతోచును. అంతా స్వప్న తుల్యమే. భ్రమమాత్రమే

శి : ఇది జాగ్రదావస్థకదా! జాగ్రతకూడా స్వప్నమువలె అసత్యమేనా?

గు : స్వప్నమందు వచ్చిన దేహము జాగ్రతయందు లేదు. కనుక స్వప్నదేహము సత్యంకాదు, అంటున్నాము. జాగ్రతయందు కనుపించే దేహము స్వప్నమందునూ లేదు. కనుక స్వప్నదేహమువలె జాగ్రద్దేహమున్నూ సత్యం కాదని యెందుకనరాదు?

శి : ఐతే జాగ్రత్స్వప్నములకు తేడాయే లేదంటారా?

గు : కనుతెరచికనే స్వప్నం జాగ్రదవస్థన్నారు. కనుమూసి కనే స్వప్నం, స్వప్నాఅవస్థ అన్నారు. రెండూ తన యొక్క చలనము చేతనే తోస్తూ వుంటాయికదా!

శి : పరిపూర్ణమునందు తోకతోచిన యెరుకను నరస్వప్నము వంటిదేనని పోల్చవచ్చునా?

గు : నరస్వప్నము వంటిదని అనరాదు. నరస్వప్నమునకు స్మృతియో సంస్కారమో ఏదో ఒకమూలముంటుంది పరిపూర్ణమందు యెరుకకు ఏ మూలమూలేదు. కనుక దానిని దీక్షితులవారు సురస్వప్నమన్నారు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పదమూడవ ప్రకరణము

## జ్ఞానసప్తావరణములు

శి : అయ్యా, విద్యాసప్తావరణములు (జ్ఞానసప్తావరణములు) ఏవి?

గు : (1) సాధనచతుష్టయసంపత్తి (2) సర్వబ్రహ్మబుద్ధి (3) బోధోపరతి వైరాగ్యములు (4) మహావాక్యార్థ విచారము (5) చతుర్విధయోగాభ్యాసం (6) చిద్వస్తు సాక్షాత్కారానుభవద్వారా అహం బ్రహ్మేతి నిశ్చయము (7) అంధునివలె, జడునివలె, సంచరిస్తూ దృశ్య శూన్యమై తూష్ణీభావంచేత వుండుట. ఈ ఏడున్ను జ్ఞాన సప్తావరణాలు.

శి : వీనియందు దృఢనిశ్చయము కల్గి వీని నభ్యసించి కృతార్థుడు కావచ్చునా?

గు : సత్ చిత్ ఆనందములు వాచ్యార్థ లక్ష్యార్థములచే చెప్పుటకేగాని యివి పరిపూర్ణపరబ్రహ్మ ప్రతిపాదకములుగావు. కనుక యివన్నియు మాయయే. వీనిని నమ్మకూడదు.

శి : ఐతే వీనిని వేదశాస్త్రపురాణములు యెందుకుచెప్పెను? వివేకు లెందుకు అభ్యసింతురు?

గు : వినేవారి అధికారము కొద్ది శ్రుతి చెప్పెను.

శి: అది ఎట్లు?

గు: మొదలు అక్షరాభ్యాసముచేసి క్రమక్రమముగా వేద శాస్త్రములు యేలాగు చదువుకొందురో, అలాగే శిష్యుని అధికారంకొద్ది వేదములు చెప్పవలె.

శి: ఐతే శ్రుతిప్రమాణములుకూడ తొందరపడి అంగీకరించరాదన్న మాట.

గు: అవును. అదేకాకుండా కొన్ని శ్రుతులు మరికొన్ని శ్రుతులచేత వ్యాహతములగును

శి: ఇందుకు దృష్టాంతముగా ఒక విషయముచెప్పి నిరూపించండి స్వామీ!

గు: కేవలం ప్రాపంచికులకంటె వృతమైనవారేమన్నారంటే "ప్రారబ్ధం, భోగతోనశ్యేత్, తత్త్వజ్ఞానేన సంచితం।

ఆగామిద్వివిధం ప్రోక్తం తద్ద్వేషీ ప్రియవాదినౌ॥

అనగా: సంచితమూ ఆగామీ అను రెండూ పోతవి అనిన్ని, ప్రారబ్ధం పోదనిన్ని అన్నారు.

శి: ఎందుకట్లా అన్నారో వివరించండి స్వామీ!

గు: ఎంత జ్ఞానికైనా ప్రారబ్ధశరీరము, అందు దోచు వివిధావస్థలు తప్పవు. కాని దగ్ధపటంరీతిగా శరీరము మిగిలి యుండును.

కాని దాన సుఖదుఃఖములుచే ఆతడు బాధింపబడడు. కస్తూరివుంచిన భరిణవలెగా, కస్తూరి అంతయూ అయి పోయినా దాని గంధము మాత్రము మిగిలియుండును. అట్లే దానియొక్క అహంకార మమకారములు

పోయినా శరీరము మాత్రిం ప్రారబ్ధమువలెనే వుండును. అల్లాగే ప్రారబ్ధముండునన్నారు.

శి: అంతకంటె వుత్తమాధికారులేమన్నారు?

గు: ఒక రాజు చస్తే అతని ముగ్గురు భార్యలలో ఒకత్తె మాత్రము ముత్తైదువగా యిద్దరు మాత్రం విధవలౌతారా? అట్లా ఆగామి సంచిత ప్రారబ్ధములు మూడూ కూడా ఏమీలేవు అని వార్తికకారులన్నారు.

శి: ఈ వార్తికకారులే మూలసూత్రము ననుసరించి అట్లు చెప్పినారు?

గు: తాను విశుద్ధజ్ఞానస్వరూపుడు కనుక భ్రాంతిజన్యమైన జీవభ్రాంతి [illegible] యెప్పుడూ లేదు. కనుక ఆగామి సంచిత ప్రారబ్ధములు భ్రాంతిలేనివానికి ఏమీలేవు. జీవభ్రాంతి కలవానికి మూడూవున్నవి. మూటికి కారణమైన జ్ఞానంపోతే మూడూలేవు.

శి: ఈ వార్తికకారుల మతము సత్యంగా తోచుచున్నది.

గు: కాదు, అంతకంటె యుత్తమాధికారికి అదిన్ని అబద్ధమే. తాను వున్నంతసేపూ, మూడు లేవని అన్నా వున్నవి కనుక గురుకృపచేత మేలుకొంటే ఏమీలేదు.

శి: యింతకంటే యుత్తమభావనలేదు. యిదే సత్యమని అనుకోవచ్చునా?

గు: మాటయే మాయ. కనక యిదీ అబద్ధమే యిన్నిటినీ గుర్తెరిగే ఎరుకేలేదు. ఎరుక పుట్టనేలేదు. మొదలు లేకుంటే కొమ్మలు లేనట్లు మాయమేలేదు. లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమీలేదు, తాను ఎప్పుడూలేను

గనుక తనకు యెప్పుడూ ఏమీలేదు.

శి : యిట్టి వృత్తమోత్తమాధికారి దృష్ట్యా ప్రారబ్ధంమాట ఏమి?

గు : కలలో వచ్చిన శరీరం, సగంవుండి సగంపోలేదు. కనుక మళ్ళీ ప్రారబ్ధం, శరీరం, జగత్తు అనకూడదు.

శి : మరి అట్టి పరిపూర్ణునికి శరీరం లేదా? క్రియలు చేయుటలేదా?

గు : నీకు ప్రారబ్ధమున్నది. నీవు క్రియలు చేస్తూవున్నావనుట యేలా వుందంటే, వెంటరావద్దంటే యెత్తుకోమని యెత్తుకొన్న చందంగా వున్నది.

శి : మరి ప్రపంచం మాట ఏమి?

గు , ఆత్మతోనే అనాత్మ పోయెను. గడ్డపారనిలువని గాలికి దూది నిలుస్తుందన్న చందముగా తాను లేను కనుక తనచేత తోచిన ప్రపంచమూలేదు. చంద్రాభావమందు చంద్రికాభావము, జలాభావమందు ద్రవ్యత్వాభావము, సాకారాభావమందు ఛాయాభావము, వేరే చెప్పాలా? ఆలాగే యెరుక అభావమంటు సమస్తమూ అభావమే. లేదనేదే లేదు. మూలవిగ్రహాలు మూలకూర్చుంటే, వుత్సవిగ్రహాలకు వూరేగింపుపల్లకీ సేవలన్నట్లు, యెరుకే లేదంటే యెరుకచేత చేసే కార్యములు సత్యమనుట అవివేకము.

శి : యిక యేమని అనాలి?

గు : అన్నా, అనకున్నా, పుట్టని గిట్టని పరిపూర్ణమేయున్నది. అది షడూర్మిరహితమైనది. షడూర్మితాకారము కానిది

శి : ఇక కర్తవ్యమేమి?

గు : అట్టి పరిపూర్ణమున్నదని, దానియందెరు కెప్పుడూ లేనేలేదని, అడుసులో త్రొటిపంచు ననగద్రొక్కినట్లు ఎరుకను అణగద్రొక్కవలెను. ఇది భ్రాంతిలేని బ్రహ్మబోధ

శి : ఇది వింటే, నీళ్ళలో వుప్పుపోసినట్లు, నట్టేటిలో పుట్టి మునిగినట్లు, పరిపూర్ణములో యెరుక మునిగిపోవును కాబోలు.

గు : నీళ్ళలో పోసిన వుప్పు కరిగిపోయినా తిరిగి తీయవచ్చును నట్టేట మునిగిపోయిన పుట్టెనుగూడ యేదయో వుపాయముచే పైకి తీయవచ్చును. పుట్టెకు నీరు జాగా యిచ్చును. పరిపూర్ణమందు సందులేదు. పరిపూర్ణములో యెరుక మునిగిపోవునని చెప్పరాదు. నీళ్ళలో పోసిన నీళ్ళవలె పాలలో పోసిన పాలువలె యెరుకలో యెరుకే మునిగిపోవును. కనుక యీ పరిపూర్ణబోధచే పోయిన యెరుక, మళ్లీ రాదు.

శి : ఎరుకలో ఎరుక మునిగితే, ఆ రెండు యెరుకలు కలసి ఏకమైయుండునుగదా!

గు : అట్టి అఖండ యెరుకయే, ఏమీలేనిది. కనుక ఏమీ లేకుండా పోవుచున్నది. పరిపూర్ణమొక్కటే బయలై వుండును.

శి : హరిహర బ్రహ్మములంతా పోయినా నిర్జగత్ అయినపుడు, యిప్పుడు, అప్పుడు, ఎప్పుడూ, బైలై వున్నదనకుంటే తమస్సున్నదనరాదా?

గు : సద్భావాతరహితమైనదంటే యింకా తమస్సెక్కడుంటుంది?

శి : తమస్సు సద్భావాంతర్భావము కాదు. ఎలాగంటే, తమస్సునకు శబ్ద స్పర్శ రూప రస గంధాదులు లేవు. కనుక అది పంచభూతాంతర్భావము కాదు. దిక్కుల కంటె వ్యాప్తమైయున్నది. కనుక దిక్కులు కాదు. దానిని మించియున్నది. సమస్త కాలముల వున్నది. కనుక కాలముకంటే అనాది. త్రిమూర్తులు, అష్టమూర్తులు, విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు ప్రత్యక్పరమాత్మలు, అంతర్బహిస్సులు యివి అన్నీ పోగా అంధకారము నిలచియున్నది. మరిన్ని అది అస్త్ర శస్త్రములచే ఛేదింపబడదు.

గు : అగ్ని యొక్క అభావమందు తమస్సు వున్నది గనుక అభావరూపమైన తమస్సు పరిపూర్ణ మెట్లౌతుంది?

శి : అలా కాదు ప్రభో! అభావమునకు స్వరూపం లేదు. సర్వపదార్థ దృశ్యశక్తి లేదు కనుక అది అభావపదార్థము కాదు. జ్ఞాన పదార్థము కాదు.

గు : గుర్తు లేనంతమాత్రాన తమస్సే పరిపూర్ణమనరాదు. తమస్సు సూర్యచంద్రాదులచే నశిస్తు వున్నది. కనుక "తమోచలతి" అని ప్రతీతిన్ని వున్నది. సకల దేశాల యందు, సమస్త వస్తువులయందు, మొదలు కొనా లేక, సజాతీయ స్వగత భేదములు లేనిదే పరిపూర్ణము గాని, తమస్సే పరిపూర్ణం కాదు.

శి : తమస్సునకున్ను తమరు చెప్పిన లక్షణములు సరిపోవు

చున్నవి.

గు : రూపమున్నూ చలనమున్నూ కల తమస్సు పరిపూర్ణ మెట్లగును? సూర్య చంద్రాగ్నిహోత్రముల చేతనున్నూ సమస్త విరోధముల చేతనున్నూ ఏది పోదో అదే పరిపూర్ణ పరబయలు, అదే సమస్త భూతిరహితమైనది. స్థాణువు.

శి : యితరులు చెప్పే పరమాత్మ స్థాణువు కాదా?

గు : కాదు. అది గుర్తెరిగే చైతన్యమే అదే మాయ అంతా దాని సత్తాచేతనే ప్రకాశిస్తూ వున్నది. పరిపూర్ణము తప్ప మిగిలినదంతా అదే. అణువుకు అణువు మహత్తునకు మహత్తు అయివున్నది. ఏయింటికి తగినట్లు ఆ యింట్లో దీపం ఎట్లు ప్రకాశిస్తుందో, మరిన్ని దీపం చిన్నవత్తితో కూడుకొన్నపుడు సూక్ష్మంగానున్నూ; పెద్దవత్తితో గూడుకొన్నపుడు స్థూలంగానున్నూ ప్రకాశించినట్లు, బ్రహ్మాదిస్తంభ పర్యంతం యుపాధులతో గూడి ఎక్కడికక్కడ సరిపడియుండును పరిపూర్ణము తప్ప, ఎరుకగాని ద్రవ్యం పరమాణువైనా లేదు.

శి : ఇంతటిగొప్ప యెరుకయందు భ్రాంతి ఎట్లు నశించును?

గు : వాస్తవముచేత యెరుక పుట్టనే లేదు. గురుకృపచేత గుర్తువిడచి మేలుకొంటే, పట్టువిడుపు లేని పరిపూర్ణమే స్వతస్సిద్ధము.

శి : యితరులు వాసనాక్షయం మనోనాశం చేస్తారితే చాలునంటారుగదా! పరిపూర్ణబోధే కావాలన్న

మాటఏమి?

గు : నత్తలు, గుల్ల అయితేనేగాని తేలనే తేలవు. తేలినా వాని అంతట అవి ఒడ్డుకురావు అలాగే తాను లేని స్థితి(పరిపూర్ణబోధవల్ల) కుదిరితేగాని. సర్వభ్రాంతులు వాసనారహితంగా వాని అంతట అవి నశించవు

శి : వానిఅంతట అవే నశించునని ఎవరన్నారు? వారైనా వాసనాక్షయాదులకు మార్గాంతరములు సూచించలేదా?

గు : అగస్త్య మహామునివంటివాడే సముద్రమును ఔపోసనమునుపట్టి యింకింపచేయగలడుగాని. వృద్ధరణితో తోడి సముద్రమును జలరహితం చేయనగునా? అట్లే అల్పసాధనలచేత, అల్పబోధచేత, ఎరుక భ్రాంతి రహితం కాదు, జన్మరాహిత్యం సిద్ధించదు.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పదునాల్గవ ప్రకరణము

## షడ్విధలింగములు - గురునిష్ఠ

గు : పరిపూర్ణ మనావరణము. దానికి సప్తావరణములు లేవు. సప్తావరణములు ఏవంటే అవిద్య (2) శరీరపరిగ్రహము (3) కర్మము (4) దుఃఖము (5) అభిమానము (6) అవివేకము (7) రాగద్వేషములు అన్నిటికిని మూలము అజ్ఞానము. అది అనాది జ్ఞానాజ్ఞానములకు మూలములేదు ఇదే హృదయగ్రంథి. అని కొందరు, హృదయగ్రంథి ఛేదన జరిగితేనేకాని జన్మరహితముకాదు.

శి : అది ఎట్లు ఛేదించవలెను? దీనికి సాధనములేమి?

గు : అధికారి, విషయము, సంబంధము, ప్రయోజనము. యీ నాలుగున్నూ అనుబంధ చతుష్టయము అని చెప్పబడును.

శి : వీనిని వివరింపుడు?

గు : సాధనచతుష్టయసంపన్నుడే అధికారి. ఆత్మవిచారణయే సంబంధము. జ్ఞానముచేత అజ్ఞాననాశనము చేయుటయే ప్రయోజనము. వేదాంత శ్రవణాభిలాషయే విషయము.

శి : పరిపూర్ణ బోధయందు ఇవన్నియు కావలెనా? ఏ సాధనలు లేవందురే! హృదయగ్రంథి అను దానికి మీ రెట్లు అర్థము చెప్తారు?

గు : అవును, ఇవన్నీ తాను ఉన్నవానికేగాని యీ మార్గమునకు అక్కరలేదు. ఈ మార్గమందు షడ్విధలింగ విచారము చేయవలెను. కర్మజ్ఞానములు ముడిపడిన దానికే హృదయగ్రంధి అని పేరు.

శి : షడ్విధ లింగవిచారణచేస్తున్నది ఎరుకేకదా! కనుక ఆవిచారము మాత్రము ఎందుకు?

గు : ఆ యెరుక శూన్యమగుట కొరకే విచారము.

శి : ఆ షడ్విధ లింగములు ఏవి?

గు : (1) ఉపక్రమోపసంహారము (2) అభ్యాసము (3) అపూర్వము (4) ఫలము (5) అర్థవాదము (6) వీనికి కారణలింగము అనుపమాన లింగము, స్థిరలింగము, అనుభూతిలింగము, సాక్షిలింగము, కార్యలింగము, అని వరుసగా పేర్లు పెట్టబడినవి.

శి : ఆ లింగ విచారణమేలాగు?

గు : ఇందు వాచ్యార్థమనిన్ని, లక్ష్యార్థమనిన్ని, రెండు విధములు.

(1) *ఉపక్రమోపసంహారము* : (ఎ) వాచ్యార్థము : సృష్టికి పూర్వము జగత్తు నామరూపరహితమై సత్తామాత్రమైవుండెను అని చెప్పుటయే ఉపక్రమము. (అధ్యారోపము) తో చెడి విశ్వము అసత్తు యొక్క స్వరూపము గనుక జగత్తు లేదనుట ఉపసంహారము.

(అపవాదము)

(బి) లక్ష్యార్థము : తనచేత జగత్తు తోస్తూయున్నది. గనుక తానే జగత్తుకు మూలము గనుక తాను పుట్ట నూలేదు. పోనూపోదు. అదే కాకుండా. లేని సృష్టికి ఒక సత్తావున్నదని చెప్పకూడదు. ఏలననగా. సృష్టి లేదనియుంటే, దానికి కారణరూపమగు సత్తా లేదనియే చెప్పక తప్పదు. పరిపూర్ణము సత్తారహితము. శశశృంగము, నవరత్నఖచితము అని చెప్పాల తగునా? లేనివి లేకుండా చెప్పడమే ఉత్తమము. యిదియే ప్రథమ లింగలక్ష్యార్థము

శి : అభ్యాసమనెడి ద్వితీయ లింగ విచారమెట్లు?

గు : (2) నాలుగు మహావాక్యములకు, జహల్లక్షణ మొదలైన పంచవింశతి లక్షణముల చేత జీవబ్రహ్మైక్యాను సంధానముచేసి నీవు బ్రహ్మమని సచ్చిదానంద గుణములు తనయందు నిర్ణయించి తొమ్మిది ప్రకారముల శిష్యునికి ఉపదేశించి శృతి స్మృతుల చేతనున్నూ దృష్టాంతరముల చేతనున్నూ ధృఢము చేసి "తత్వమసి, త్వంతదసి అవయోరంతరం. నవిద్యతే! ఆదిమధ్యాంతరహిత అఖండ అద్వయ కల్పిత అపరిచ్ఛిన్నదృగాకాశమేవ" యిటువంటి వాక్యముల చేత దృగాకాశమే నేననుకోవడము అభ్యాసమునకు వాచ్యార్థము.

(బి) లక్ష్యార్థము : ఎట్టిదైన దృగాకాశము మూడు కాలములయందు లేదని, దృఢముగా భావించుట

శి : ఓహో! అద్వైతపద్ధతి వాచ్యార్థమని పరిపూర్ణ పద్ధతి

లక్ష్యార్థమని మీ అభిప్రాయమా? సరే మూడవ లింగమును గురించి వివరించండి స్వామీ!

గు : (బి) మూడవ లింగము అపూర్వమునకు వాచ్యార్థమేమనగా అష్టప్రమాణములచేతను ఉపనిషత్ప్రమాణములచేతను దృగ్దృశ్య విచారణచేత ఎరుక యొక్క స్వరూప నిర్ణయము గావించుట (బి) లక్ష్యార్థము: దృగ్ దృశ్యముల పరిత్యజించి పూర్వాపర శూన్యమును గ్రహించి లేని ఎరుకను తెలిసి ఎరుక తోస్తూయున్నపుడు కూడా యొక్క ఎరుక అత్యంతాభావమును గ్రహించుటయే లక్ష్యార్థము.

శి : యీ అభ్యాసపరుడు ఏలాగున వుండును? అతనికి ఎరుక అత్యంతాభావమై ఏలావుండును?

గు : మానరక్షణ కొరకు వస్త్రము ధరిస్తే శీతబాధ కూడ ఏక కాలములో ఎట్లు నివారణ అగునో అట్లాగే పరిపూర్ణము దేహమును చర్మము కప్పియున్నట్లుగా తన్ను పూర్తిగా చుట్టుముట్టి నిబిడమైయున్నదనీ అంతే కాకుండా దేహము యొక్క బాహ్యాభ్యంతరముల యందు పరిపూర్ణమే ఎక్కడను సందులేకుండా యున్నదనీ భావించుటలో ఎరుక అత్యంతాభావమేననికూడా దృఢము కాగలదు.

శి : నాలుగవ లింగమేదో వివరింపుడు?

గు : శ్లో॥ "లింగే ప్రాణం సమాదాయ, ప్రాణేలింగంతు శాంభవం శరీరం మనః కృత్వానకించిచ్చింతయేద్బుధ" అని మనః ప్రాణముల ఏకత్వము చేసి "నేతినేతీతి,

శేషితంచ యత్పరమంపదం" అని మనఃప్రాణములతో కూడిన దానిని నిరసించి, శేషించినదే పరమపదమని అవాఙ్మానసగోచరమని, అచలమని, భావించడమే ఫలమను నాలుగవ లింగము. తద్రహితమందు శేషించియున్నదే లక్ష్యార్థము.

శి : అయిదవదగు అర్థవాదలింగ మేమో సెలవీయండి స్వామీ!

గు : వాచ్యార్థము : ఉపనిషదర్థాతీత వాక్యములను మథించి గురువులను తెలిసికొని సన్మార్గ ప్రవిష్టుడై యుండుట. లక్ష్యార్థము : ఏవస్తువయున్నదో ఆ వస్తువు యొక్క ప్రతిపాదన వాక్యములే వచించడము, వినడము. ఆచరణలో దానికి సరిపడిన నడక నడవడము యిదే అర్థవాదము. అర్థవాదమనగా సార్థకమైనవాదము కనుక అర్థవాదమనిపించుకొనును యిది అయిదవ లింగము.

శి : ఉపపత్తి అను లింగము యొక్క విచారణ కూడ చెప్పండి?

గు : లేనియెరుకను యిప్పుడున్నదనుకోకూడదు, ఎప్పుడునూ లేనేలేదు; పుట్టనే లేదు గనుక పోనేపోదు. పరిపూర్ణము తప్ప రెండవది ఏమీ లేదు. అది అస్తినాస్తులు గానిది. అని విచారణ చేస్తే తెలియును. కనుక లేనియెరుకకు ఉత్పత్తే చెప్పకూడదు. తన దీపమును మూర్ఖుడైన వాడు ఏమిచేసినా తనకు తెలియదు! తానైన ఎరుకను నమ్మకూడదు. కాని నమ్మక నమ్మవలెను.

శి : నమ్మిక నమ్మట అనగానేమి?

గు : ఎరుక వున్నదనే నమ్మకము ఈమనో్మాత్రము అంతఃకరణమందు లేకుండా, వ్యవహారకాలమందు మాత్రము ఎరిక వున్నట్లుగానే యెంచి అది సత్యమని పూర్తిగా నమ్మకము వున్న ప్రపంచికులవలెనే, సకలకార్యములు చేయుట. యిట్టి నమ్మికనమ్మిటి నమ్మకము కూడా పరిపూర్ణపరబ్రహ్మమందు లేనే లేదని తెలియవలెను. తానులేడు గనుక నమ్మికే లేదు.

శి : ఇట్టి స్థితి ఎట్లు చేకూడును?

గు : గురూపదేశముచేతను, స్వానుభూతిచేతనూ లభించును పైన చెప్పిన షడ్విధ లింగవిచారముచేత స్వానుభూతి సిద్ధించును యీ విచారమున్నూ గురునిష్ఠయున్నూ వుంటే యీ బోధ పరిశుద్ధమై స్థిరముగానుండును లేకుంటే అంతఃకరణము చంచలమైయుండును.

శి : గురునిష్ఠ అనగానేమి? అట్టి నిష్ఠలేకపోతేనేమి?

గు : గురునిష్ఠయనగా గురుని శాసనము ప్రకారము నిత్య జీవితము గడుపుకొనుటయే. పోట్లయెద్దుకు ముక్కుతాడు వేసినట్లు, పాముకు కట్టుకట్టినట్లు, గురునిష్ఠ శిష్యుని ప్రవర్తనను సరిదిద్దును, ప్రవర్తన మాత్రముండి, గురుబోధ లేనిచో బౌద్ధమతము నశించినట్లు నాశనము చెందును

శి : ఎక్కువ మాటలు లేకుండ సాధకుని కర్తవ్యమేమో సూటిగా సెలవివ్వండి స్వామీ?

గు : గురువాక్యము, సాధుసంగము, ఈ రెండూవుండి ఎరుక ఎప్పుడు తోస్తుందో, అప్పుడు గురువాక్యము స్మరించుకొంటూ వుండే నిష్ఠ తప్పక వుండవలెను,

శి : అట్టి నిష్ఠ పూనినచో ఏమి సిద్ధించును?

గు : గురుకృప.

శి : ఎంతకాల మిట్లు స్మరిస్తూ వుండవలెను?

గు : రాతి బావికి యినుప బొక్కెన అవసరమైనట్లు, ఎద్దు జీర్ణమయ్యేవరకు నెమరువేయునట్లు, నిదుర వచ్చినదనుక, చచ్చినదనుక యీ ఆచార విచారములు మానరాదు.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పదిహేనవ ప్రకరణము

## వర్ణాశ్రమాచార నిరసన

గు : తానుండగా ముక్తి అని చెప్పనేకూడదు. తాను లేక పోవుటే నిజమైన ముక్తి.

శి : మరణించిన తర్వాత మాత్రమే ముక్తి సాధ్యం అని తమయభిప్రాయమా?

గు : ఛ, ఛ! దేహమే ఆత్మయనీ మరణమే మోక్షం అనీ అనేవారు చార్వాకులు.

శి : తాను అనే మాటకు మూలంలేని ఈగుర్తెరిగే శరీరము అని అర్థం చెప్పుకోవాలా? సరేకాని తాను వుంటే మాత్రం ముక్తి ఎందుక్కూ వుండకూడదు.

గు : తానెప్పుడు వుండునో, తనకు కర్తవ్యమున్నూ వుండును కర్తవ్యమువుంటే, భోక్తవ్యము, దానిచే ప్రారబ్ధత్రయమున్నూ సంభవించును? యీ మూడూ వుంటే యిక జ్ఞానమెక్కడిది? జ్ఞానము లేకుంటే అజ్ఞానధ్వంసమున్నూ కాదు. అపుడు ముక్తియనేదన్ని శశవిషాణం వంటిదే.

శి : ప్రారబ్దత్రయం తెలపీయండి స్వామి!

గు : 1. ఇచ్ఛాప్రారబ్ధము అనగా స్వసంకల్పముచేకల్గినది. 2 అనిచ్ఛా ప్రారబ్ధము, తాను వద్దని వ్రతిఘటించినా కలుగు సుఖదుఃఖములు. (3) పరేచ్ఛాప్రారబ్ధము అనగా అన్యుల సంకల్పంచేత తనకు సిద్ధించు ఖేదమోదములు.

శి : వర్ణాశ్రమాచార ధర్మముల మాటయేమి? కొందరు పాటించాలి అంటారు. కొందరు కూడదంటారు ఏమిటి స్వామీ!

గు : తామేలేరు. తమకు వర్ణాశ్రమాచారాదు లెక్కడివి? అంతా భ్రమయే. లేనిపోని అభిమానములెందుకు? లేనిది లేదనడం యుత్తమంకాదా! స్వప్నతుంమువచ్చిన జన్మములకు కులగోత్రములేమి?

శి : ఎరుక స్వప్నమువంటి దనని అరూఢం కానివారిమాట ఏమి?

గు : సరేపోనీ, ఆలక్షణంమీాదే విచారిద్దాం. వర్ణం అంటే ఏమి? అది ఒక రంగేనా?

శి : బ్రాహ్మణుడు శ్వేతవర్ణము; క్షత్రియుడు ఎరుపు (రక్తవర్ణము) వైశ్యుడు పీతవర్ణము. శూద్రుడు నీల వర్ణం అని నిర్ణయముంది.

గు : శ్వేతవర్ణమే బ్రాహ్మణుడంటే శ్వేతముఖులంతా బ్రాహ్మణులు కావలసిందే, అట్లాకారు. కనుక వర్ణము బ్రాహ్మణత్వము కాదు.

శి : కర్మణాజాయతే ద్విజః అన్నారు కనుక కర్మయే

బ్రాహ్మణుడనవచ్చుగాదా?

గు : ఎవరికి తగినకర్మ వారికి వుండనేవున్నది, పోనీ బ్రాహ్మణులు షోడశకర్మలు చేయుటకు చేయించుటకు అధికారము కలవారు, అంటే శూద్రుడా కర్మలన్నిటిని చేసి, చేయించడంనేరిస్తే అతడు బ్రాహ్మణుడగునా?

శి : "వేదపాఠంతు విప్రాణాం" అని వున్నది కనుక వేద పారాయణ చేయుట బ్రాహ్మణత్వము. కనుక ధర్మమే బ్రాహ్మణత్వము అనవచ్చును,

గు : క్షత్రియులు వైశ్యులు కూడా వేదం చదువవచ్చును. మరిన్ని వేదము రానివారెందరు? వారు బ్రాహ్మణులు కారా?

శి : బ్రాహ్మణ తల్లిదండ్రులకు పుట్టినచో వారిని బ్రాహ్మణులంటాము. కనుక దేహమే బ్రాహ్మణుడు అని అంటే!

గు : సర్వుల దేహములు సప్తధాతుమయములేకదా! బ్రాహ్మణుడు చనిపోయిన తన మాతృ, పితృ శరీరములు దహించినట్లైతే వానికి బ్రహ్మహత్యా దోషంరావాలి. అట్టిదోషం వచ్చుటలేదు సరిగదా, వారికి పుణ్యలోకాలు కల్పించిన అదృష్టం పట్టినదని పొంగిపోతున్నారు గదా! కనుక దేహమే బ్రాహ్మణుడని యనరాదు.

శి : ప్రాణము బ్రాహ్మణుడంటే?

గు : ప్రాణము అందరియందు వున్నదికదా; అది జడము కూడా అయివుంది. అది బ్రాహ్మణుడెట్లగును?

శి : పోనీ మనస్సు బ్రాహ్మణుడంటే సరిపోతుందా?

గు : అదియును అందరియందు వున్నదిగదా! ఎవరియందున్న మనస్సుకు బ్రాహ్మణత్వం చెప్పాలి? నిరాకారం, అవయవరహితమూ అయిన మనస్సు బ్రాహ్మణుడు కాడు అట్లే బుద్ధి జీవాంతఃకరణము, చైతన్యము, ఆనందము, హిరణ్మయకోశము మొదలగునవి అందరియందూ వున్నవే! కనుక అందు దేనికీ బ్రాహ్మణత్వము చెప్పరాదు, వాచ్యార్థ లక్ష్యార్థ గౌణార్థములచే బ్రాహ్మణత్వము ఎవరికి వున్నట్లు చెప్పుటకున్ను సావకాశము లేదు.

శి : దేనికీ బ్రాహ్మణత్వము చెప్పుటకు వీలు లేకుంటే అసలా బ్రహ్మణత్వము దేనికి పుట్టుతుంది?

గు : ఈమూలంలేని అభిమానమునకే బ్రాహ్మణత్వము అని తోచుచున్నది. నేను బ్రాహ్మణుడనని అహంకారాభిమానమోహములచే అభిమానించడమే. అహంకారం వదలితే, అభిమానము, అభిమానం వదలితే మాయ ఏమీలేదు, తానేలేదు. గనుక ఏమీలేనేలేదు, పరమగురుకృపచేతగాని పాదువదలదు.

శి : ఎందుచేత స్వామీ!

గు : గుర్తు అనే గృహమునకు. అహంకారమే కవాటము ఆవరణ విక్షేపములే గొళ్లెములు. హృదయగ్రంధియే తాళము. విజ్ఞానమే తాళపుచెవి. అది గురుమూర్తి వద్దనేకలదు. ఆ తాళం గురుమూర్తి చేతనే తెరువ

బడుతుంది, అప్పుడే తాననే తెర తొలగిపోవును. అది పోతే, ప్రకృతి పురుషులు, త్రిగుణములు, చిజ్జడములు, సదసత్తులు లేవు. ఆద్యంతరహితాచలమే స్వతస్సిద్ధం. "మాయాశూన్యమితిజ్ఞాత్వా, కాయకర్మాద్విముచ్యతే। కాయమూలమిదం మాయ, మాయామూలం శరీరకం, ద్వయార్మూలం సదా నాస్తి సదా ధృవం॥ ఎండమావులవలె ఎరుక గాన వచ్చినా, ఏమీ లేదు. ఎరుక వున్నదనటం, ఎలాంటిదంటే బ్రహ్మచారీ నీకెంతమంది బిడ్డలన్నట్లున్నది.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పదహారవ ప్రకరణము

## కర్మధర్మజ్ఞాన నిరసన ప్రకరణం

గు : సర్వకర్మధర్మములు, జ్ఞానాజ్ఞానములు లేనిదే పరిపూర్ణము. అట్టి బట్టబయలులో ఎరుక యెప్పుడూ పుట్టనే లేదు.

శి : అయ్యా! మీరు చెప్పే సిద్ధాంత మిట్లుంటే- కొంత మంది జన్మ వస్తుందనిన్ని పూజాధ్యాన జపాదికములు జన్మను బాపుననిన్ని, అంటున్నారు. చచ్చిన వానికి ప్రేతత్వం వస్తుందనీ, దానాదులవల్లా పుణ్యకర్మల వల్లా ఆ ప్రేతత్వము తొలగునని, లేకుంటే యమ లోకంలో దుఃఖము లనుభవించి తిరిగి పుడతాడనిన్ని కొందరంటున్నారు.

గు : నవరత్న ఖచితమైయున్న నరశృంగమును నేనుచూచితి నని యొకడంటే, ఆ వార్త నమ్మే పామరులున్నూ వుంటారు. ఎరుక పుట్టనే లేదంటే యిపుడే జన్మంలేదు. ముందు తాను పుట్టేది యేమి? యివన్నీ అపభ్రంశపు మాటలే. కలలో, కత్తియుద్ధంలో గాయములై రక్తం కారుచున్నట్లు, బాధపడుచున్నట్లు, కలగంటే, అవి సత్యములగునా!

శి : తానే లేడు కనుక తనకు ఏమీ లేదు.

గు : శెభాష్! కాని యీ నిష్ఠ వుండటం బహుకష్టం. ఒకరిని చూచి నేర్చుకొందామన్నా పట్టుపడదు.

శి : ఎందుచేత స్వామీ!

గు : సాటివారిని చూచి చెవుల రంధ్రములు పెద్దవిచేసుకో వచ్చును; కన్నులను పెంచి పెద్దవి చేసుకొనగల్గునా? ఈ బోధ చెందనివార్కి ఆ నిష్ఠ కుదురదు; ఉన్నది ఏది? పొయ్యేది యేది? వచ్చేది చచ్చేది దేనికి ప్రత్యక్షము?

శి : శరీరమే ప్రత్యక్షంగా వస్తూవున్నది పోతూవున్నది.

గు : అట్లనరాదు. చెట్టునుంచి రాలిన ఆకులే మరల చిగుర్చునా? ఎండిపోయిన చెట్టే మళ్ళీ మళ్ళీ పుట్టునా? కనుక శరీరానకు జన్మవున్నది అనీ, పోతుంద అనీ మరలా జన్మిస్తుందని అనరాదు.

శి : మరి అయితే, యీ శరీరంతోనే యెరుకపోతుంది అని తమ అభిప్రాయమా?

గు : అట్లాకాదు. మహాత్ములకు యిప్పుడే యేమీ లేదు. చచ్చిన పిదప పోవుటకాదు. ఎప్పటికీ ఏమీ లేదు. దేహము పోయినవానికే మోక్షమనరాదు. తానే లేకపోయిన పిదప యిక దేనికి మోక్షము?

శి : యిట్టి ఆరూఢత ఎట్లు చేకూరును?

గు : గురుకృపచే యిప్పుడు మేలుకున్నాడు. కనుక సర్వకాల సర్వావస్థలయందును తాను లేనే లేడు. ఈ లేనివాడు పుట్టనే లేద ; పోనూపోడు. మళ్లీ పుట్టడు.

శి : వాయువనెడినే లింగ శరీరమున్నా చక్షురాదీంద్రియములకు కానరాక పోయినా శరీరంనుండిపోతుంది? మళ్లీ రానూవస్తుందిగదా!

గు : దానంతటదే పోతుందా? ఎవరైనా వచ్చి తీసుకెడతారా?

శి : యమదూతలువచ్చి కాలపాశంవేసి తీసికొనిపోతారుట

గు : తీసికొనిపోవుటకు, ప్రవేశ పెట్టుటకు అదేమైన భౌతిక పదార్థమా! లేక భావపదార్థమా.

శి : వాయువంటి పదార్థము? దానిని తీసుకొనిపోయి యాతనా శరీరమందు వుంతురు.

గు : కాలపాశముచేత వాయువును యెవరైనా పట్టితీసుకొని పోగలరా? శరీరమా, లేక పోయెను. స్వరూపము లేక పోయెను. పాశములచేత అదికట్టుబడునా?

శి : అయితే లింగశరీరము అబద్ధమన్నమాట.

గు : రెండు కలిస్తేనేగాని లింగశరీరంలేదు. ఒకటిలేదు, రెండూలేదు. యికవాని కూటమి ఎట్లు? శ్రుతి: "స్వసంకల్పవశాద్బద్ధో నిస్సంకల్పాద్విముచ్యతే" యిదే సిద్ధాంతం

శి : ఐతే శ్రాద్ధాది క్రియలు, తద్దినాలు మాటవేమి? జీవుడు చేసిన పుణ్యాపాపాలు యమలోకంలో విమర్శ చేయబడతాయని, వాని దుఃఖ ఫలితాలు కొన్ని అక్కడ కొన్ని యిక్కడ అనుభవించాలని అంటారు గదా!

గు : దీని విషయములో మూఢనమ్మకాలుచాలావున్నాయి.

శంకలూ చాల వున్నాయి విజ్ఞాన దృష్టిచే యోచిస్తే ఒకరు చేసిన దుష్కర్మఫలము మరొకరు చేసే సత్కర్మవల్ల నివర్తియగునా? ఎవరికర్మఫలం వారికే అనాలి. అపుడు కూడా సత్కర్మఫలం అనగా పుణ్యం వేరుగా అనుభవించాలి అనీ, పాపం వేరుగా అనుభవించాలనీ, పాపాన్ని పుణ్యం కడిగివేయదని, ఒకమూల అంటూనే వున్నారు తాను చేసిన పుణ్యమే తన పాపాన్ని పోగొట్టకంటే యితరులుచేసిన పుణ్యంవల్ల తనపాపం యెట్లా లేకుండా పోతుంది?

శి: పెద్దలు అంతా చేసినారుగదా! మనం చేస్తే మాత్రం పోయేదియేమి? చేస్తే పాపం అయితే రాదుగదా!

గు: చేయువచ్చును. ఐతే "నేను దుష్టకర్మలు చేసినా ఫరవాలేదు. నా కొడుకు దాన ధర్మాలు శ్రాద్ధాదులు చేసి నన్ను స్వర్గానికి పంపిస్తాడు" అని దురాశతో దుర్మార్గాలు చేయడానికి దారితీయకుండా వుండాలి మరి!

శి: కాని శాస్త్రాలు యీకర్మలు ఎందుకు విధిస్తున్నాయి?

గు: ఈ విధి నిషేధాలు ఎవరు నిర్ణయించినారు? యివన్నీ ఎవరికి తోచెను? ఎవరు గుర్తెరిగిరి? ఈలేనెరుక ఎందు పుట్టినది? దానికే మూలంలేదు. తానే లేకుంటే బంధమోక్షము లెవరికి? తానే లేకుంటె తనది అనే మాటే వుండదు. తోచే దెవరికి? అనుభవం యెవరికి?

శి: ఇదంతా మాయా విలాసమేనా?

గు : గురువాక్యం దృఢమైతే మాయ లేదు. గురైకిగే కాయమే మాయ. అది పుట్టనూ లేదు. గిట్టనూ లేదు.

శి : మాయకు చిక్కకుండా నిధిధ్యాస సమాధుల యందుంటే ఏ బాధా వుండదన్నారు, అందుకే కాబోలు!

గు : స్వస్వరూపమే వుండగా నిధిధ్యాస యెందుకు? నేనే స్వతిస్సిద్ధమై వుంటే సమాధి యెందుకు? బంధముక్తి లేవు మనస్సు లేదు. కనుక శ్రివణాదులూ లేవు తన్ను తెలియకుంటే నేమి? సువర్ణమును తెలిసితే సువర్ణమై లేకుంటే యిత్తడి యగునా? ఎరిగినా,ఎరుగకున్నా తాను తానే.

శి : తెలుసుకొంటే తాను లేకుండా పోవచ్చునుగదా!

గు : జన్మయే లేదంటే. తెలియకపోతేవుంటాడు, తెలిస్తే లేకపోతాడు అనవచ్చునా?

శి : ఐతే కర్తవ్యమేమి?

గు : ఒకప్పుడు తాను, తానుగానని, యిప్పుడు తాను తాను గావాలని ప్రయత్నం చేయరాదు. తాను లేకపోయ్యేందుకే ప్రియత్నం చేయాలి. తాను యెన్నడూ కాని దానిని వెతుకవలెను. తాను లేకపోయే గురువాక్యమే పొందవలెను. పొందితే నిర్భయము.

శి : మరి ముక్తి ఎవర్కి? తన్ను విడవడం తాను లేకపోవడమే ముక్తియా?

గు : ముక్తియే మృష, ఎండిన చెట్టుకు ఎన్నినీళ్ళు పోసినా యెట్లు చిగురించదో ఆలాగే తాను లేనే లేదు.

శి : ఈ స్థితియొక్క అనుభవమేమి?

గు : గురుకృపచేత మేలుకొంటే, అడ్డంగావున్న పరజాపట్టి తీసివేసినట్లే అంతా బట్టబయలే.

శి : ఆ విధంగా బట్టబయలు తనకు ప్రత్యక్ష మౌతుందన్న మాట.

గు : ప్రత్యక్షమూ లేదు, అప్రత్యక్షమూ లేదు. గురువాక్యంచే ఎరుకనే తెరను కత్తరించి లేకుండా చేసేస్తే గుర్తేవుండదుకదా! యిక ప్రత్యక్షం దేనికి?

శి : ఐతే యీ బోధ వలన ఫలితమేమి?

గు : సుఖదుఃఖాలు పుణ్యపాపాలు, బంధమోక్షాలు అనే ఏ భ్రాంతులు ఏమీ లేవు. యీ మార్గము మృత జీవుని మార్గము.

శి : ఎరుక మార్గము యెట్టిది?

గు : అది జీవన్ముక్తి మార్గము. తన్నుతాను తెలియుడమే ముక్తి అంటారు. వేపాకు అని తెలిసినా తెలియకున్నా అది చేదే. అది వున్నంతసేపూ ఆ చేదు పోదు. దానిని దహిస్తే తప్ప ఆ చేదుపోదు. అప్పుడా చేదు దానితోనే పోవును

శి : ఈ దృష్టాంత మెట్లు యెరుకకు అన్వయిస్తారు?

గు : ఎరుకకు దాని గుణము తెలిసినా తెలియకున్నా అది వున్నంతసేపూ అహంకార భయాదులుపోవు గురుకృపాపాత్రులకేభయమూ లేదు

శి : బోధ తెలుసుకొంటే చాలదా? గురుకృపయెందుకు?

గు : గురుచరణము పట్టనివానికి మంత్రోగ్ధసూచన వస్తు నిశ్చయంగా తెలియదు. అట్టివాడు "బయలుబయలు"

అని పూరక అంటూంటే ఏమీ సార్థకంలేదు. గురువు చెపితేగాని గుర్తుపడదు. మరుగు తెలియదు.

శి : ఎందుకు సార్థకత లేదు?

గు : కోతికి కొబ్బరికాయ దొరికితే ఏమి సార్థకం! కొరికితే పండ్లూడునేగాని కొబ్బరి చిక్కదు.

శి : గురుచరణం పట్టినవారందరికీ గురుకృపకల్గి యీబోధ పట్టునా?

గు : లక్షణ యుతులుకాని వారికి ప్రయోజనంలేదు. పూర్వపు చేష్టలుపోవు. కుక్కకు పంచదార కలిపిపాలు పోసినా తోలు కొరకకుండా వుండదు.

శి : లక్షణయుతులు కానివారిని గురువెందుకు చేర్చుకోవాలి?

గు : చెప్పిన మాటవినే శిష్యులైతే, వారిని ముందు లక్షణయుతులనుచేసి ఆపైన గురువు వారికి పూర్ణబోధ చెపుతాడు చెప్పినపనిచేయనివారికి గురువు బోధయొక్క మర్మధర్మములు చెప్పనేచెప్పడు.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

### పదిహేడవ ప్రకరణము

## వాదభావం

శి : ఈ మార్గము ఎటువంటిది?

గు : ప్రత్యక్షప్రత్యక్షమైన ఆత్మజ్ఞానమువంటిదిగాదు. అద్వైతా నంద జ్ఞానమైన బ్రహ్మజ్ఞానము వంటిదీగాదు.

శి : ఆత్మజ్ఞానమునకు బ్రహ్మజ్ఞానమునకు తేడా ఏమి?

గు : ఆత్మజ్ఞాన మనగా యోగజ్ఞానము. బ్రహ్మజ్ఞానమనగా కేవల బోధవల్ల వచ్చే జ్ఞానము. ఈ రెండూగాని తూష్ణీ మౌన నిష్ట అయిన వార్త్రిక జ్ఞానమువంటిది కూడా కాదు.

శి : ఆ వార్త్రిక జ్ఞానము యెటువంటిది?

గు : జ్ఞానము చే జ్ఞేయ వస్తువును తెలిసి ఆ జ్ఞానమును కూడా వదలి మౌనంగా యుండు స్థితినే వార్త్రికజ్ఞాన మందురు.

శి : ఎరుక స్వరూపమును యెరిగిన, యెరుకను ఏది ఎరుగును?

గు : ఎరుకను ఎరిగేది గుర్తెరిగే జ్ఞానము.

శి : రెండూ ఒకే వస్తువా? లేక వేరు వేరుగా వుండి ఒక దానిని రెండవది గుర్తెరుగునా?

గు : ఒకటే ఎరుకను యింకొక యెరుక గుర్తించును అంటే

ఆ యెరిగే యెరుకను గుర్తించేది మరియొక ఎరుక వుండవలసి వస్తుంది. ఆలాగున చెబితే అనంతములు ఆగును. కనుక ఆలాగున అనరాదు. దాని నదే గుర్తెరుగుననవలెను.

శి : ఎందుకనరాదో, దానిచే అదే ఎట్లు గుర్తింపబడుచున్నదో, సద్దృష్టాంతంగా సెలవీయండి స్వామీ?

గు : ఘట ప్రత్యక్షమునకు కారణం ఘటరూపం. ఆ ఘటరూపమునకు కారణం ఆ ఘటమే.

శి : సరిగా అర్థం కాలేదు మరొక దృష్టాంతం చెప్పండి స్వామీ?

గు : సర్వపదార్థముల యొక్క రూపములు గ్రాహ్యమగుటకు ప్రకాశం (తేజస్సు లేక వెలుగు) కారణం ఆ తేజస్సు తెలియబడుటకు కారణం ఆ తేజస్సేనా వేరేయున్నదా? అట్లాగే యెరుకను గుర్తెరిగే నిమిత్తం యెరుకే కారణం, ఆధారం అయివున్నది. మరొకటి లేదు.

శి : "యన్మనసానమనుతే యేనాహుర్మనోమతం" అని శ్రుతి మనస్సునకు తెలియ శక్యము గాదని చెప్పుట లేదా?

గు : యింద్రియ మనస్సులకు గోచరం గాకున్నా లక్షణా చేతనైనా కానవచ్చునని చెప్పబడుటలేదా? మరిన్ని విచారణ ద్వారా బ్రహ్మ సాక్షాత్కారమగునని అంటున్నారు గదా? దేనికి సాక్షాత్కారము? ఎవ్వరికీ సాక్షాత్కారమే కాలేదంటే, పెద్దల స్వానుభూతికే

భంగము. కనుక ఆత్మకు ఆత్మే మనస్సు ద్వారా సాక్షాత్కరించును.

శి : పోనీ చక్షువులకు కానరాదు అనుటలో ఆక్షేపణ లేదు కదా?

గు : మనస్సునకెట్లు గోచరమంటిమో అట్లే చక్షువునకున్ను గోచరమని చెప్పదగును.

శి : మనస్సు అంతఃపదార్థము, నిర్మలము, ఆత్మసత్తాధారము. కనుక జ్ఞానచక్షువైన నిర్మలమనస్సునకు బ్రహ్మసాక్షాత్కారము చెప్పినప్పటికి జడమైన చక్షువున కెట్లు చెప్పనగును?

గు : ఆత్మ మనస్సుతోనూ మనస్సు యింద్రియములతోనూ గూడి ప్రవర్తించుచున్నది. మనస్సునకు బహువిస్తారముగా, చక్కగా గోచరిస్తే చక్షువునకు కొంచమైనా గోచరిస్తుంది

శి : ఇంద్రియముల ద్వారా కలిగేటి భ్రాంతి జ్ఞానమే గదా భ్రాంతి జ్ఞానము యదార్థ జ్ఞానమునకు సాధనమగునా? కారణమగునా?

గు : కావచ్చును.

శి : యిది ఎట్లాగో దృష్టాంతమైన చెప్పండి స్వామీ!

గు : ఒకనికి అడవిలో ప్రయాణం చేస్తూన్నట్లు కలవచ్చింది ఆ కలలోనే పెద్దపులి వచ్చి తరిమింది. ఆ భయంతో కెవ్వున కేక వేసి మెళకువ చెందేడు. కలా, కలలో తోచిన పులీ రెండూ మృషే ఐనా ఆ పులి కల నివృత్తి ఎట్లా చేసెనో అట్లాగే భ్రాంతిజ్ఞానము యదార్థ

జ్ఞానము నకు కారణం కావచ్చును.

శి : ఎండమావులు చూచి జలము అని భ్రమించి పోయిన వారికి దాహ శాంతి యెన్నడైనా అగునా? భ్రాంతి జ్ఞానము యదార్థ జ్ఞానమునకు దారి తీస్తుందంటే ఒప్పుతుందా?

గు : ఎందుకొప్పదు? ఏస్థానమున ఎండమావులుతోచినవో అక్కడకుపోతే నిజంగా ఒక చెరువు మక్కడనుండుట తెలిసి స్తే వానికి దాహోపశమనం అయినట్లు. యదార్థాన్వేషణలో యిది ఆత్మ యిది ఆత్మ అని భ్రాంతిచే తోచి చివరకు యదార్థ జ్ఞానము కలుగుచున్నది. ముత్యపు చిప్పను (శుక్తిని) చూచినప్పుడును, వెండిని చూచినప్పుడును, గూడా యిది వెండి అనే జ్ఞానము కలుగుచున్నది మొదటిది సంవాది భ్రమ రెండవది అసంవాది భ్రమ

శి : యదార్థమును యదార్థంగానే గుర్తెరిగినపుడు దానిని కూడా భ్రమయనే యెందుకనాలి?

గు : జ్ఞానమే భ్రమ, అనుకోడం భ్రమే. అది సత్యమని ఋజువైతే ప్రమ అంటాము లేకుంటే భ్రమే,

శి : పరిపూర్ణ బోధయందు యీ భ్రమలు ఏ విధంగా అన్వయిస్తారు?

గు : దృగ్గోచరమయ్యే తేజోంధకారములయందు పరిపూర్ణ మున్నదని వానితో గూడా గలిపి ధ్యానించడం సంవాది భ్రమ వాని రహితమునందు పరిపూర్ణబ్రహ్మము వుండ చూచుకొనుట అసంవాది భ్రమ,

శి : పరిపూర్ణము వుండజూచుకొనుట కూడా భ్రమయేనా?

గు : వుండ చూచుకొన్న ఎరుక వున్నంతసేపూ తానువుండి పరిపూర్ణమును వుండజూచుకొన్నంత వరకు అది భ్రమ గాక ఏమవుతుంది? అదియును భ్రమే అయినా యదార్ధ వస్తువుల యొక్క ప్రత్యక్ష హేతువు అవు తోంది,

శి : ఎరుకే సర్వత్రనిండి సర్వ పదార్థ రూపములై యున్నది గదా?

గు : ఐతే తేజస్సుయందూ జడవస్తువులయందూ వుండాలి గదా! వుంటే యెందుక్కు యెరుగుట లేదు?

శి : జడముల యందు ప్రయోజనం లేదు, ఒక చిత్రంలో వున్న మానవుల చిత్రములకే వస్త్రములు వేసి వృక్ష నదీ పశు పర్వతాదులకు చిత్రకారుడు వస్త్రములు యేలాగు వెయ్యడో ఆలాగే జడము నందు చిదాభాసు డుండుటకు నిమిత్తము లేదని చిచ్ఛరీర బ్రహ్మవాదులు అన్నారు,

గు : ఒకచోట ప్రయోజనం, మరొకచోట అప్రయోజన మున్నా ఆత్మకుండునా?

శి : దర్పణమున్నచోట ప్రతిబింబం వుండునట్లే అంతఃకరణ మున్నచోట ప్రతిబింబ ముండును,

గు : ఆలాగంటే అంతటావుంది యెరుక అనే వారి మాట యెగిరి పోయినట్లే కదా? మీ పక్షం యేలావుందంటే "భ్రష్టస్య కావాగతిః" అన్నట్లున్నది ఎరుక మాయకనుక సర్వవికారములు దానికి స్వభావమే. అడుగపనిలేదు.

శి : పోనీ చిత్తుకు జన్యము లేదనీ జడమునకే జన్యత్వమని, వారు చెప్పే మాట మీరు అంగీకరిస్తారా?

గు : జడమైతే సర్వవ్యాపారములు ఎలాగు?

శి : ఆత్మసత్తాచే జరుగుచున్న వంటున్నారు.

గు : అప్పుడు ఆత్మకు కర్తృత్వం రాదా?

శి : ఆత్మకు కర్తృత్వము ఎప్పటికీ లేదనే వారి సిద్ధాంతం.

గు : ఎలా లేదు? స్పష్టంగా కానవస్తూందిగదా? అంటే నీవి మొండి వాదం, నీభ్రాంతి, నీకండ్ల వికారమనీ, అవిద్యవల్ల అట్లా నీకు తోస్తోంది అంటూ రుకూడా.



# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పద్దెనిమిదవ ప్రకరణము

## నిర్భయ జిజ్ఞాసము

గు : ఏది తెలివి రూపంగా, యెరుక రూపంగా, సర్వసాక్షి రూపంగా సచ్చిదానంద స్వరూపముగా నున్నదో ఆ తత్త్వమే బ్రహ్మమని కొందరన్నారు.

శి : మీరు కాదంటారా?

గు : కాదు. జ్ఞాతృజ్ఞాన జ్ఞేయముగానూ ద్రష్టదర్శన దృశ్యగానూ యింకా యితర త్రిపుటలుగాను, సర్వాధారమై, సర్వమును ఏది గుర్తెరుగుచున్నదో, అదే పరిపూర్ణ బ్రహ్మం (absolute) అంటే యెట్లు అంగీకరిస్తాము?

శి : దానిని మీరు ఏమంటారు?

గు : లేనెరుకంటాము. సాలెపురుగువలె అది సృష్ట్యాదులు, చేయునదనీ త్రిమూర్త్యాతీతమనీ, జగద్వ్యాపకమనీ, చిదాకాశమనీ, కోటిసూర్యప్రకాశమనీ, దానికే అనేక పేర్లు పర్యాయపదాలుగా వాడుచున్నారు. మాయ దాని శక్తియే గనుక, దానికి మాయా లక్షణములన్నియూ వున్నవి గనుక అదేమాయ. దానిని మేము లేనెరుకన్నాము.

శి : లేనెరుక అనేదాన్ని మరికొంచెం వివరించండిస్వామీ!

గు : సూత్రధారివలె సకల చరాచరములందు ఆటఆడించేది అదే. ఆడించి, తిరిగి ఆడించక, విలక్షణమైయుండేది అదే. సూక్ష్మముకంటె సూక్ష్మమై, ఉన్నతముకంటె యున్నతమై, నిగమాగమములకు ఆధారమై తాను ప్రకాశిస్తూ సర్వమును ప్రకాశింపచేయుచు, జగదాధారమై, గురుశిష్యాత్మకమై, నిరామయమై చిద్ఘనమై యున్నదీ ఆలేనెరుకే అదిలేకపోతే ఏమీలేదు. దాని యందలి భ్రాంతి రహితమైతే సర్వభ్రాంతి రహితం, బంధమోక్ష రహితం, జన్మమృత్యు రహితం, గురు శిష్య రహితం.

శి : అట్టి భ్రాంతి రహిత మెట్లగును?

గు : భ్రాంతి రహితం చేసుకొన్న గురుడైతేనే యితరుల భ్రాంతి రహితం చేయగలడు. ఎరుకభ్రాంతిగల గురుడైతే భావ్యములనే త్రాళ్ళతో ఘట్టిగాకట్టి భ్రాంతి సముద్రంలో ముంచి తేలనివ్వడు

శి : భ్రాంతి రహితం చేయుటకు ఏమి సాధనచేస్తారు?

గు : మూలాభావము కనుక మొదటనే భ్రాంతి లేదు, చావు బ్రతుకులు సంకల్పవికల్పాలు ఏమీలేవు. ఈవిషయమే దృఢము కావలెను. మరే సాధనతోను నిమిత్తం లేదు.

శి : అయ్యా దేనికి మూలము లేదని అంటారు. అన్నిటికి కారణకార్య పరంపర, కనిపిస్తూనే వున్నదికదా!

గు : కారణమునకు మరొక కారణము, దానికి మరలనింకొక

కారణము కనిపిస్తూయున్నమాట నిశ్చయమే కాని ఒక స్థితి వచ్చుపరికి దానికిక కారణము లేదు.

శి : అట్టి కారణములేని వస్తు వేది?

గు : అదే నేను. నాకు (ఆ నేనుకు) ఆధారము యెక్కడను లేదు. అందరియందును నేనే వున్నాను, అన్నిటిని ప్రకాశింపచేయువాడను నేనే. నన్ను ప్రకాశింప చేయునది మరేదలేదు. ఆ "నేను" కే మూలంలేదు మిగతా అన్నిటికి మూలంకలదు. దానియందు భ్రాంతి రహితమైతే సర్వభ్రాంతులూయుడిగిపోవును.

శి : అన్నిటికి మూలమైన యీ "నేను" లేకపోయిన పిదప మరేముండును?

గు : "భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబయలు" అన్నారు కాని యేమున్నదీ చెప్పేటందుకింకేమున్నది? మనస్సునకు వాక్కుకు అందనిదేదో అదే వుండును, అని చెప్పే వారే వుండరు.

శి : ఎందుచేత?

గు : మూలములేని నేను లేకనేపోతిని. నాకన్యమైఉన్నది, యెరుక లేకనె వున్నది. ఇక చెప్పేది ఏది?

శి : అపుడు అదివరకంతటా వున్నట్లు వుండే యెరుక ఏమై పోవును?

గు : పరిపూర్ణ బ్రహ్మమందు రానూలేదు, పోనూపోదు. ఏలాగున వచ్చెనో ఆలాగే పోవును. తనంతట తానే తనలోపటనే వచ్చి తనంతట తానే లేకపోవును.

శి : ఎరుక విషయమై సూత్రభాష్యము, వార్తికాదులూ ఏమని చెప్పినవి?

గు : యెరుక సత్యమనే చెప్పినవి. పరిపూర్ణ బోధ తెలియక పోతే అంతే అనిపిస్తుంది.

శి : అట్టివారికి జన్మరాహిత్యము లేదా!

గు : లేదు తాబేలు పుచ్చెమీద కొడితే యెట్లు చావదో, అట్లాగే యితర బోధలచేత భ్రాంతి రహితము కాదు. జన్మకారణ వస్తువు తొలగదు

శి : ఈ యెరుకకు ఒక దృష్టాంతం చెప్పండి స్వామీ!

గు : స్వప్న దృష్టాంతము ఒక్కటే సరియగు దృష్టాంతమూ. నాస్వప్నము చిన్నికల. ఈ యెరుక పెద్దకల. రెండూ ఒక్కటే మూలంలేని తాను లేనపుడు ఏమీ లేదు.

శి : ఏమీ లేకపోవుట యెట్లు? తాను పుట్టివున్నాడుగదా!

గు : పరిపూర్ణ బ్రహ్మమందు తాను పుట్టలేదు. పుట్టితినను కొంటే. తనయందే తాను పుట్టితిననుకొనవలెను. తన కన్యమగు మూలము తనకు లేదు. కనుక పుట్టితినను కొన్నా, పుట్టనే లేదనుకొన్నా పుట్టకనే పుట్టితినను కొన్నా ఏ బాధా లేదు పరిపూర్ణ పరబ్రహ్మమందు మాత్రము తాను పుట్టలేదనుకొంటేసరి. ఇక భ్రాంతి లేదు రోగము లేదని ధృఢమైనది. ఇక ఔషధమెం దుకు? నిర్భయము, బంధమోక్షములు దేనికున్నవని అనుకొనెనో అదే లేకపోయెను. ఏమీ కానటువంటి పరిపూర్ణ బ్రహ్మమేవుండెను. కలకు మేలుకలిగెను. కల పోయినట్లైతే కనుటకు యెవరున్నా లేరు.

శి : పై విధంగా కల మేలుకొన్నవా డెట్లుంటాడు ఏమను కొంటాడు? ఏమి మాట్లాడతాడు? ఏమి చేస్తాడు?

గు : ఐతే ఆ కల మేలుకొన్నవాడిని నేనే అనుకో. యిప్పు డడుగునన్ను ఆమేలుకొన్నవాడు చెప్పే సమాధానాలు నేను నీకు చెపుతాను.

శి : అట్లే స్వామీ! అట్లాగే అడుగుతా, సెలవీయండి- నీ వెవరవు?

గు : నేను ఏమీ లేనివాడను

శి : నీ పేరు ఏమి!

గు : నా పేరు పరమ పురుషుడు. నేనే బ్రహ్మను వేద శాస్త్రములన్నీ నేను పుట్టించినాను. నావుండే జీవే శ్వరాది ప్రపంచము కల్పితము. అన్నీ నేనే అయినాను కాని అవి నాకంటే వేరే అని అంటున్నాను.

శి : ఏలక్షణచే విచారించి, నీవు బ్రహ్మను అని ఆరూఢ పరచుకొన్నావు? జహల్లక్షణయా, అజహల్లక్షణయా, జహదజహల్లక్షణయా? స్వరూపలక్షణయా, అతిద్వ్యావ్రి వృత్తి లక్షణయా?

గు : నేను విచారణకు ముందూ బ్రహ్మనే, అపుడు బ్రహ్మము కాకుండావుండి యిపుడు క్రొత్తగా అవలేదు.

శి : విచారణ యెరుగనివాడు నేను జీవుడననే చెప్పాను గదా!

గు : తెలియక చెప్పాను. కాని తెలిసినా తెలియకున్నా నేను ఎప్పుడూ బ్రహ్మమునే.

శి : మన వుపనిషత్తులు భాష్యములు వార్తికములు ఏమి చెప్పుచున్నవి!

గు : నేను బ్రహ్మమనీ సర్వసాక్షిననీ చెప్పినవి. నేను సచ్చిదానంద స్వరూపుడనని యోగులు ఆంతర్యమందునూ శాస్త్రకారులు వాక్యములచేతనూ, నన్నే బ్రహ్మమని చెప్పుదురు.

శి : మతకారులు ఏమని చెప్పుదురు?

గు : ఆ మతములన్నియు నావల్లనే పుట్టెను. ఏ మతమునకు తగినట్లు ఆ మతమును చెప్పినది నేనే.

శి : నీవు, ప్రకృతివా? పురుషుడవా? మీయుభయుల సంబంధమేమి?

గు : నేను పురుషుణ్ని నేనే ప్రకృతిని ప్రకృతిని విడచితే నాకు పుట్టుకలేదు. ఈ రెండూ లేనివేనని, పూర్ణబోధ రెంటినీ నిరసిస్తున్నది.

శి : నిన్ను గురించి యింకా విశేషములేమి?

గు : అన్ని విశేషములు నేనే. ఆ విశేషములన్నీ నావే, కాని నిర్విశేషుడనని పేరెట్టుకొన్నాను. అణువు, మహత్తు కళ, అనిర్వచనీయము, ఆకాశము, చిదాకాశము, పరమాత్మ, పంచభూతసాక్షి, పంచకోశ విలక్షణుడు. ప్రత్యగాత్మ, జ్యోతి, ద్రష్ట దృశ్య దృశ్యము బ్రహ్మము. ఈ అన్నీ నా పేర్లే.

శి : నీ స్వరూపం విషయమై నీవు చెప్పినవి అన్నీ యితరులున్నూ చెప్పుచునే వున్నారు. ఇక భేదమేమి?

గు : పరిపూర్ణ బ్రహ్మమందు నేను పుట్టనేలేదు. నా యందే నేను వున్నాను. కాని పరిపూర్ణ బ్రహ్మమందు లేను. కనుక నేను అసత్యము సత్యవస్తువొక్క పరిపూర్ణ పర

బ్రహ్మమే.

శి : నీవు నేనే లేకపోతే ఎట్లా యోచిస్తున్నావు? ఎట్లా మాట్లాడుతున్నావు? ఎట్లా చేస్తున్నావు?

గు : చెప్పేనుగా! పరిపూర్ణ పరబ్రహ్మమునందు నేనేలేనని దృఢపరచుకొని ఆవిధంగా నేను లేక నా యందు మాత్రము నేను వుండి ఎట్టి భ్రాంతియు లేకనే త్రికరణములచే కర్మలు చేయుచున్నాను.

శి : కర్మ చేస్తున్నానంటున్నావుకదా! చేస్తే ఆకర్మ ఫలమునుండి ఎట్లు తప్పించుకొందువు?

గు : కర్త అయిన నేను పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేను అనే దృఢభావనచే యెట్టి కర్తృత్వము లేకనే నేను కర్మలు చేయుచున్నాను, నేను నావల్ల నుత్పత్తియై నాయందేవున్న సహస్తమూ లేనేలేవు. కనుక నాకు కోరికయేలేదు. ఈవిధంగా నేను కర్మచేయక చేస్తున్నాను. కనుక నాకు కర్మఫలమంటదు జన్మమూలేదు

శి : ఐతే నీవు ఎరుకచే సర్వమూ గుర్తెరుగుతూ సర్వమూ చేస్తునే వున్నావు. నీవు తెలుసుకొంటున్నావా? లేదా? నీవు జ్ఞానినంటావా? అజ్ఞానినంటావా?

గు : తెలిసినాసరే తెలియకున్నా సరే లేనిది త్రోసివేసినను సరే తెలుసుకొనుచున్న దానిని ఆదిలేనిదానిని రెంటినీ తెలుసుకొని పిమ్మట దేనినీ తెలుసుకొనుటలేదు నేను జ్ఞానినీగాను అజ్ఞానినీకాను నీవేమనుకొన్నాసరేనేనులేను.

శి : అందుకే మీకింత నిర్భయము!

గు : శెహభాష్! సరిగా గుర్తిస్తివి.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## పంతొమ్మిదవ ప్రకరణము

## సర్వమత వివేచన - అధికారి తారతమ్యము

గు : ఈ పరిపూర్ణ భావము అన్ని సిద్ధాంతములకు అతీతము.

శి : అది యేలాగో సెలవీయండి స్వామీ?

గు : కొందరు, స్థూలదేహమే యాత్మయని. కొందరు యింద్రియములే ఆత్మయని, కొందరు హంసయే బ్రహ్మమని, కొందరు శూన్యమే బ్రహ్మమని, కొందరు ఈశ్వ బ్రహ్మమని, కొందరు ఆత్మ అణువని, కొందరు విభువని, కొందరు ఆత్మ దృశ్యమని, అంతఃకరణే జీవుడని కొందరు, అంతకరణ ప్రతిఫలిత చైతన్యమే జీవుడని కొందరు, అంతఃకరణాధిష్ఠాన చైతన్యమే జీవుడని కొందరు, వారివారి మతానుసారంగా వాదిస్తున్నారు.

శి : అన్ని మతములకంటె గొప్పదన్న అద్వైతమత మేమంటుంది స్వామీ?

గు : అంతఃకరణము, అందలి ప్రతిఫలిత చైతన్యము, అధిష్ఠాన చైతన్యమూ, యీ మూడుగూడి జీవుడన్నారు. మరిన్ని ఆత్మయే దృక్కు అనిన్ని, అది సత్యమనిన్ని, దృశ్యం అసత్యం, జడం, అనిన్నీ అన్నారు.

శి : యీ మతాచార్యులెవరూ పరిపూర్ణ భావమును యెరుగరంటారా?

గు : ఎవరేనా యెరిగున్నా, తమ మతమే దేశకాల పాత్రల కనుగుణ్యమనియెంచి ప్రచారం చేసుకొని యుంటారు.

శి : దీక్షితులవారికి పూర్వం యెవరేనా యీ పరిపూర్ణ బోధచే కృతార్థులైనారా?

గు : ఆహా! బసవేశ్వర్డు అల్లమా ప్రభువువల్లను, శ్రీకృష్ణుడు సాందీపునివల్లనూ శ్రీమహావిష్ణువు పరమశివునివల్లను వుపదేశము పొంది ఆవరణ రహితులైనట్లు చరిత్రలు న్నవి యీ పరిపూర్ణబోధ తెలియకపోతే నిర్భయ త్వము కలుగదు.

శి : యీ బోధస్థితి శాస్త్రములు చూస్తే కుదురదా?

గు : కుదురదు సద్గురు ప్రోక్తముగా జన్మరహితమునకై మర్మధర్మములను తెలిసి ఆచరించినగాని తెలియదు. మర్మము తెలుసుకోవలెనని గ్రంధము చూస్తే రెండింటా చెడును.

శి : యెందుకు చెడును?

గు : ఎంతమంచి మధురజలములైనా వేపచెట్టుకు పోస్తే దానికి చేదు చచ్చునా?

శి : యీ పూర్ణబోధ తెలిసిన వారందరికి యితర సాంప్రదాయక బోధలన్నీ తెలుసునా?

గు : అంతకు పూర్వం తెలుసుకొనియున్నా మానినా, యేనుగు నెక్కినవాడు దిడ్డికంతలో దూరుటకు యత్నించని రీతిగా యీ బోధ పొందిన అనంతరం యితర బోధల చెంతకుపోడు.

శి : యీ బోధ యెంతకాల మభ్యసించవలెను?

గు : యెంతబోధగలవాడైనా ఆజన్మాంతం విచారణచేస్తూ వుండవలసినదే. ఎంత శూరుడైనా నిద్రపోతున్నప్పు డు ఎంత అల్పుడైనా చంపివేయవచ్చు. అట్లే గురు బోధ మరచియుంటే భ్రమ పుట్టడానికి అవకాశము టుంది. యీ నిష్టవుంటే యేభ్రమలూ కమ్మవు. యెరుక యెప్పుడు గలదో, అపుడు గురుబోధ మరువ రాదు. కనుక యెరుక వృక్షమును గురుబోధచేత భస్మము చేస్తూ వుండవలెను.

శి : యెరుకను వృక్షముగా నెట్లు పోల్చెదరు?

గు : యెరుకనే వృక్షమున కాద్యంతములు జీవేశ్వర్లు విష యములే శాఖలు. మహావాక్యములే పర్ణములు. సాక్షి ననుకోవడమే దాని ధర్మం.

శి : యితరవాదములవల్ల జ్ఞానాగ్ని యుత్పన్నమై యీ యెరుక వృక్షమును కాల్చజాలదా?

గు : గురుబోధయే అట్టి జ్ఞానాగ్ని. అంతేకాని మంత్రవాద తంత్రవాద, రసవాద, మహిమవాద, మాయావాద, శూన్యవాదాది వాదములు అహంకార వృద్ధిహేతు వులేగాని తన్నాశనకరములు కావు.

శి : అహంకార నాశనమువల్ల ఏమి ప్రయోజనం?

గు : అహంకార నాశనమైతే యేభ్రాంతులూ వుండవు. అంతేకాదు. కామక్రోధాదులు గవయవు.

శి : పరిపూర్ణబోధంతా ఒక్క ముక్కలో చెప్పండిస్వామీ!

గు : పరిపూర్ణ బ్రహ్మమునందు ఎరుకకు మూలంలేదు.

శి : అట్లైకిగితే ఏమి సిద్ధించును?

గు : మూలంలేనిది కనుక రానూలేదు పోనూలేదు అని ఆరూఢత సిద్ధించును.

శి : ఐతే మధ్యనూ ఏమీ లేనట్లేకదా!

గు : భేష్ భేష్, బాగా గ్రహించేవు. యిట్టి దృఢంవుండవలె.

శి : యిక సుషుప్తినుంచి జాగ్రిత వచ్చినట్లుగా యెరుక వచ్చింది అని మళ్ళీ ఎందుకు చెపుతారు?

గు : వంధ్యాపుతుని పట్టాభిషేకం యిట్లాజరిగింది అని చెప్పినట్లే వినేవారి అధికారంకొద్దీ చెపుతారు. యిది ఒక విధంగా తటస్థలక్షణంచేత చెప్పినట్లే

శి : ఆ లక్షణమేమో అది యీ పూర్ణబోధయందెట్లన్వ యింతురో తెలపీయండి స్వామీ!

గు : శాశ్వత సంబంధము లేకపోయినప్పటికి తాత్కాలిక ముగా వచ్చే సంబంధము పురస్కరించుకొని చెప్పుట తటస్థలక్షణం. ఉదాహారణకు, "అడిగో ఆకాకివాలి నదే దేవదత్తుని యిల్లు" అని చెప్పుట తటస్థలక్షణము కాకికి యింటికి శాశ్వత సంబంధమేమీ లేదుగదా! అట్లే యెరుక నిజంగా పుట్టకపోయినా, పుట్టినట్లు వున్నట్లూ గానవస్తూంది కనుక, అట్టి యెరుకకొక దృష్టాంతము చెప్పుట తటస్థలక్షణము వంటిది.

శి : ఐతే స్వరూపలక్షణ, అతద్వ్యావృత్తి లక్షణములను గూడ గ్రహించుచున్నారా?

గు: సర్వలక్షణ విలక్షణమైయుండుటే దాని లక్షణము స్వరూప రహితమే స్వరూప లక్షణము. "అస్థూల. మనణ్వ, మలోహిత, మకృష్ణ, మశీత, మవృష్ణ, మకారణ, మకార్య" అని యీలాగు చెప్పుకోడమే అతద్వ్యావృత్తి లక్షణం.

శి: యీ బోధయందు శక్తి పాతమనేది కూడా వున్నదా?

గు: ఆహా! గురువాక్యం ద్వారా శోకపోవుటే శక్తిపాతం. అన్ని మహిమలూ యెరుకవే. పరిపూర్ణానికి ఏ మహిమలూ లేవు

శి: ఎందుచేత?

గు: ముందువచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములకు వాడియున్నట్లే; మూలవిరాట్టు మూలనే కూర్చుంటే వుత్సవిగ్రహాలు వూరేగినట్లే.

శి: ఈ బోధకందరూ అర్హులేగదా?

గు: అర్హులేకాని శక్తి, సామర్థ్యములు వారిస్వభావములు గుర్తించి చెప్పవలెను.

శి: ఆసామర్థ్య, స్వభావలక్షణలేమో శెలవీయుండిస్వామీ?

గు: పాషాణపాకము. దారుపాకము, చర్మపాకము, శశినపాకము అని నాలుగు రకముల సామర్థ్యములుగల శ్రోతలున్నారు.

(1) నల్లరాతిలో కొద్ది వెడల్పు, కొద్ది లోతుగల బెజ్జము ముందుగా కొట్టి ఆ బెజ్జములో వులిపెట్టి పైన ఒక్క దెబ్బగట్టిగాకొట్టితే అడుగుకంతా పగిలిపోవును అట్లే సూటిగా ఒకటిరెండు మాటలు చెపితే, ఆపైన

సర్వము చెప్పనక్కరలేకనే అల్లుకొనిపోయే శక్తిగల వారుత్తములు. ఇదే పాషాణపాకం

(2) కర్రలో ఎంత బెజ్జము కొట్టితే అంతే గాని ఎక్కువ తక్కువలు రావు ఆలాగే ఎంతవరకు బోధిస్తే అంత వరకు మాత్రం చిలుక పలుకులవలె వప్పగించగలడు. వీరు మధ్యములు యిదే దారుపాకం.

(3) చర్మమునకు అగ్గితో బెజ్జం గుచ్చి ఆరుతీయుట తోనే మరల ముడుచుకొనిపోవును. బెజ్జం కావలిస్తే మరల ఆరు గుచ్చవలసినదే అట్లై చెప్పేది చెపుతూ వుండగానే మరచిపోయేవారు. కొందరు వీరధములు యిదే చర్మపాకము.

(4) బోధ చెపుతూవుంటే దాని ననుసరించడు సరి గదా తద్వ్యతిరేకమునే పాటిస్తూ వుంటాడు. వీరధ మాధములు వీరికి బోధ చెప్పకూడదు

శి: బాగున్నాయి. యీదృష్టాంతములు. వారివారి ప్రజ్ఞా విశేషములకు సంబంధించినవి. వారి అంతఃకరణ ప్రవృత్తుల యందుండే భేదములనుగూడ వివరించండి స్వామీ?

గు: నవనీతం (వెన్న) కరిగిస్తే నేయిగా మారిపోయి తిర్గి యిక నవనీతం కాదు. అట్లా, బోధ విన్న తర్వాత ప్రపంచ భ్రమ రహితమై తిరిగి భ్రమపుట్టదు. ఈ స్వభావముగలవారు కొందరు. తేనెకాస్తే చిక్క బడినా ద్రవత్వం పూర్తిగా నశించదు. అట్లై బోధ వల్ల కొద్దిమాత్రమే ప్రయోజనం పొందేవారుకొందరు

లక్క కరిగిస్తే మరల నిమిషంలో పాషాణంవలె బిగిసి పోతుంది. అట్లే చెప్పిన క్షణంలో భ్రాంతి రహితం అయిపోయినట్లే తోచినా మరుక్షణంలో మోహము గట్టిగా ఆవరించే వారు కొందరు.

శి : గురుబోధాగ్ని చేతనే యెరుకవృక్షం భస్మం చేయవలె నన్నారు? అది ఎట్లు?

గు : మంత్రిద్వయమును ఆరణిచేసి ధ్యానముచే మధిస్తే అగ్నిపుట్టి యెరుక వృక్షమును దహించును బోధ దృఢ మైతే, ఎంత వర్షం కురిసినా పర్వతం నానిపోనట్లుగా అచలస్థితి దృఢమైన మహానుభావునికి యే బాధా లేదు

శి : యెరుక ఆ విధంగా పోతే పరిపూర్ణమే వుండునని యెవరికి తెలిసెను?

గు : యెరుక వుండగా యెరుకకే తెలిసెను. యెరుక లేనప్పుడు, లేదనేమాటా. వున్నదనేమాటా రెండూలేవు. దానితో నేపోయెను. ఇది లేనిదే అని తలిస్తే, వున్నది వుండనే వుంటుంది అని స్పష్టమేకదా!

శి : గురుబోధానంతరం జీవహీనమైన దేహమువలె నుండక యెరుక యేలాగు సర్వవ్యాపారము చేస్తోంది?

గు : సర్వవ్యాపారము చేస్తున్నట్లు ఎవరికితోచెను? ఆ పరిపూర్ణునికా? లేక నీకా?

శి : నాకే తోచెను.

గు : నీవు వున్నవాడవు కనుక నీకు తోచెను. లేనివానికి ఏమీ లేదు.

శి : ఈలాగున నాకు మాత్రం యెందుకు తోచవలె?

గు : నీకు స్వప్నము ఎందుకు తోస్తోందో యిదీ అట్లాగే తోస్తూవున్నది.

శి : తోచకుండా యెట్లు పోవును?

గు : గురువాక్యముచే కొంత కాలానికి తోచకుండా పోవును.

శి : ఎట్లు పోవును?

గు : తేనెపట్టు తీయబోయిన వానినొకని తేనెటీగలు కరుచుచూ తరుముకురాగా వాడొక తటాకములో మునిగెను. కొంచెము తాళి ఆ యీగలు పోయినవేమో నని తలఎత్తితే అక్కడే కాచిపెట్టుకొన్న యీగలు మరల కరువసాగెను. వాడు మరల మునిగెను, వాడు తలెత్తినప్పుడల్లా అవి కరచుచుండెను. చివరికాతడు నీటిలో వూపిరాడక మునిగి చచ్చెను. అట్లే యెరుక అనే కలతోచి నప్పుడల్లా ఎరుక లేదనే గురువాక్యం స్మరిస్తే చివరకు లేకుండానేపోవును.



గు : నీకు స్వప్నము ఎందుకు తోస్తోందో యిదీ అట్లాగే తోస్తావున్నది.

శి : తోచకుండా యెట్లు పోవును?

గు : గురువాక్యముచే కొంతకాలానికి తోచకుండా పోవును?

శి : ఎట్లు పోవును?

గు : తేనెపట్టు తీయబోయిన వానినొకని తేనెటీగలు కరుచుచూ తరుముకురాగా వాడొక తటాకములో మునిగెను. కొంచెము తాళి ఆ యీగలు పోయినవేమో నని తలఎత్తితే అక్కడే కాచిపెట్టుకొన్న యీగలు మరల కరువసాగెను. వాడు మరల మునిగెను, వాడు తలెత్తినప్పుడల్లా అవి కరచుచుండెను. చివరికాతడు నీటిలో వూపిరాడక మునిగి చచ్చెను. అట్లే యెరుక అనే కలతోచి నప్పుడల్లా ఎరుక లేదనే గురువాక్యం స్మరిస్తే చివరకు లేకుండానే పోవును.



లోపడిన మిడత చందము. కుడితిలో పడ్డ ఎలుకవలెనూ అంధకూప ప్రవేశమువలెనూ మునిగిపోతాడు.

శి: ఎందుచేత?

గు: ఇటుపోక, అటుగాక పుడుతూ చస్తూవుంటాడు.

శి: తన తెలివిచేతను పెద్దల సాంగత్యముచేతను, సాంప్రదాయక ధర్మమును తెలిసికొనలేడా?

గు: ఈ మార్గము వారి సాంగత్యముచేత కొంచము గ్రహించినా, ఉపనయనము కానివాడు వేదము చదివినట్లు కాగలదు. బోధలు విన్నా ఆ మార్గస్థుడు కాజాలడు దొంగ ఎప్పటికి దొర కాలేడు. అగ్నిస్తంభన గురుముఖతః తెలియనివాడు, అగ్నిలో చొచ్చి నశించినట్లో నశిస్తాడు కాన ఎప్పటికీ కడతేరలేడు

శి: ఈ బోధ ఉన్నదున్నట్లుగా గ్రహించుట ఎట్లు?

గు: సాంప్రదాయక ప్రబోధకుడైన గురుమూర్తికి, తత్సంతతికి (ఆయన భక్తమండలికి) సేవచేసి బోధ గ్రహించితే, అది మింట పెట్టిన దీపం (ఆకాశదీపము) వలె ప్రకాశించును. వాడు ఎక్కడెక్కడికిపోయినా కొదువ లేదు.

శి: ఆ విధముగా ఎరుకను గుర్తెరిగిన చాలునా?

గు: ఎరుక మార్గము తెలిసినా అది అడవి మార్గమే. ఏలననగా అది ఎప్పటికి గమ్యస్థానము చేకూర్చజాలదు. అనగా దానివలన భ్రాంతి రహితముకాదు. భ్రాంతి విస్తారమే యగును.

శి: ఎంతవరకు గురుశుశ్రూష చేయవలెను?

గు : తానున్నంతవరకు రాగద్వేషాదులు పోనంతవరకు నిష్ఠ కుదురదు. ఈ నిష్ఠామార్గము అన్యులకు తెలియదు.

శి : తెలియకపోతేనేమి?

గు : వారు ఎరుకను నమ్మియుందురు గనుక వారికి రాకడ పోకడలు తప్పవు. శృతి॥ మృత్యోస్స మృత్యుమా ప్నోతిస్సై వచాన్యం నపశ్యతి॥ అనగా వారు మృత్యువు నుండి మృత్యువునకేపోవుదురు ఎరుకే మృత్యువు. ఎరుకను నమ్మినవాడు ఎరుకచేతనె జనన మరణ ప్రవాహ రూపమైన సంసారమునే పొందునని భావము.

శి : ఎరుక ఎట్లు పోవును?

గు : గురుకృపచేత పోవును.

శి : ఐతే ఏమి జరుగును?

గు : లేని ఎరుక లేకపోతే అంతా బట్టబయలే. తాను అనే వాడు తలచుదామన్నా ఎక్కడాలేదు. నిండి నిబిడీకృతమై అంతర్బహిస్సుల అదే ఉండును. చేప నీళ్ల యందుండుంటే యెట్లు మిడిసిపడుతూవుండునో అలాగే ఎరుక ఒక్కటుంటే అన్నీ వుండును. సముద్రములోనే బడబానలము వుండి సముద్రమునే హరించినట్లు గురువాక్యముకూడ ఎరుకే అయినప్పటికి ఎరుకను హరించును.

శి : సాక్షి, మాయా, అని చెప్పబడేవానికి, ఎరుకకు, సంబంధమేమి?

గు : చేతనాత్మకమైన ఎరుకయే సాక్షి. అచేతనమనబడే మాయయూ ఎరుకే. ఎరుక ఆవిధముగా చేతనాచేత

నాత్మకమైయున్నది.

శి : మాయా అంటే లేనిది. ఎరుకను లేనిది అని ఎలా అనవలెను?

గు : అన్నదే లేదని అభిప్రాయము. కార్చిచ్చులో చొచ్చిన మృగ, పక్షి, కీటకాదులు యేలాగున నిలువవో ఆలాగే గురువాక్యంచేత ఎరుక నిలువదు. గురువు ఎరుకైనా ఎరుక లేకుండా చేయును. ఏ బోధైనా ఈ బోధకు సమానము కాదు.

శి : ఎందుచేత?

గు : నీళ్ళు పలుచగా వుండును. తైలమున్ను, నీళ్ళవలెనే వుండును. ఐతే తైలముచేత అగ్నికి ప్రకాశము వచ్చును. నీళ్ళచేత అగ్నియే చల్లారిపోవును. ఇతర బోధలు అన్ని తైలము వంటివి. ఒక్క పరిపూర్ణ బోధయే నీళ్ళవంటిది. యితరములు భ్రాంతి విస్తరింప చేయునేగాని రహితపరచవు

శి : అయ్యా! అన్నదే లేదంటున్నారే మీరు లేక చెప్పినారా! వుండి చెప్పితిరా? లేక చెప్పినా మంటే, చచ్చినవాడు మాట్లాడగ వినలేదు. ఉండి చెప్పితిరి అంటే మీరు ఉండగా నన్ను ఏలాలేవని చెప్పితిరి? పోనీ ఉండి లేక చెప్పితిని అంటారేమో! చచ్చినవాడు సగము చచ్చి సగము చావలేదన్నట్లున్నది.

గు : నీవు ఎట్లా అంటే అట్లా అనుకో. ఇదివరకు సర్పమును చూచినవాడు సర్పము యొక్క స్మృతి జ్ఞానము అంతః

కరణమందుండగా రాత్రి చీకటిలో త్రాడును చూచి పూర్వపు స్మృతిజ్ఞానముచేత అది సర్పము అని భ్రమించినట్లే, నీ అంతఃకరణమునందువుండే సంస్కారముబట్టి నీవెట్లావుంటే అట్లాగే అంటావు.

శి : చాలా గూఢముగా ఉన్నది. నాయందు పరిపూర్ణ వాత్సల్యమువుంచి స్పష్టముగా చెప్పండి స్వామీ!

గు : ఆకాశమున ధ్వని వున్నప్పటికి అన్నప్పుడూ విన్నప్పుడూ మాత్రమే ధ్వనితోచును. అలాగే నేను వున్నట్లు, అన్నట్లు, నీవు విన్నట్లు నీకే తోచినది అట్లే నీవు అన్నట్లు నేను విన్నట్లు కూడా నీకే తోచింది. నేను ఎప్పుడును లేను. నాకు తోచుటలేదు. నా వలెనే మేల్కొని చూచితే నీకును తెలియగలదు.

శి : మేల్కొని చూస్తే పరిపూర్ణము కనబడునా?

గు : చూచేది ఎఱుకేగదా! ఎఱుకను నమ్మినవానికంటే అధముడులేడు. ఎరుక కంటెనూ మాయ ఏ లోకమందునూ లేదు ఆశరీరాన్ని గుర్తెరిగితివనే శరీరము లేదు తోడేలునుచూస్తే మేకలు ఎట్లునిర్జీవములగునో అలాగే. గురుసూచనలేకంటే మరుగువిడదు.

శి : ఉన్న మంత్రమును ఉపదేశిస్తారా? లేని మంత్రమును ఉపదేశిస్తారా?

గు : మూలములేని మంత్రము ఐతేనే ముఖ్యము. ఆ మంత్రము స్మరించగానే తాను ఏమిలేకుండా పోవలెను.

శి : మూలమున్న మంత్రములు స్మరిస్తేనేమి?

గు : అట్టి మంత్రమును స్మరిస్తే జన్మసూతక మృతసూతకములు వచ్చును.

శి : అది ఎలాగు?

గు : మంత్రోచ్ఛారణారంభమందు జాతాశౌచమున్నూ మంతాంతమందు మృతాశౌచమున్నూ వచ్చును. అనగా ఆ మంత్రములకు ఆద్యంతములు వున్నందువల్ల వానికి అపవిత్రత వున్నది. అవి కృతార్థత నొందింపజాలవు

శి : "అహం బ్రహ్మాస్మి" మంత్రమునకు జాతాశౌచ, మృతాశౌచములు (అనగా పుట్టుడువల్ల అశుచి, మరణమువల్ల అశుచి) ఎట్లు కలవు?

గు : అహం అనగానే జాతాశౌచము, అస్మి అనగానే మృతాశౌచము సంభవించును.

శి : పోనీ ఆ మంత్రములకు, ఓంకారము, శ్రీకారము మొదలగునవి కలిపితే?

గు : వానికిన్ని జాతాశౌచ మృతాశౌచములు కలుగును.

శి : మీరు వచించే మంత్రములకు ఈ అశౌచములు ఎట్లు లేవు?

గు : వానికి మూలము, అంతము లేవు కనుక ఎట్టి అశుచి లేదు. లేని మంత్రములు కాబట్టి వచించగానే తన్ను లేకుండ చేయును. "మూలాభావమిదం జ్ఞాతుంనశరీరం నకేవలం(?)" ఈ మంత్రమునకు మూలమేమిలేదు.

శి : మంత్రము మాయ కాదా? మాయ, మాయను పోగొట్టునా? తమస్సు తమస్సుచేత నివర్తి అగునా?

గు : అట్లుకాదు. సూర్యుడూ మాయే. తమస్సూ మాయే అయినప్పటికిని సూర్యుడువచ్చి తమస్సునుపోగొట్టును. ఆలాగే మూలం లేనిది గనుక మూలము లేకుండా చేయును. "నిచాశ్రయం నకర్తవ్యం కర్తవ్యం మహదాశ్రమం" కనుక ఎరుక సంబంధమయిన మంత్రములను పరిత్యజించి పరిపూర్ణ సంబంధమయిన మంత్రములను స్మరించవలెను. 

శి : లేకపోవడమనగా ఏమి? 

గు : ఎరుకను పరిత్యజించి ఆ పరిత్యజించే దానిని పరిత్యజిస్తె ఏమి ఉండునో అదే నిశ్చయము, పరిత్యజించే దానిని నిర్లక్ష్యముచేసి, లక్ష్యమయిన దానిని లక్ష్యము చేసి తాను ఎప్పుడు లేనని తలచడమేనిశ్చయము. ఇదే లేకపోవడం. 

శి : ఇందలి మర్మమేమి? ఆ మర్మము తెలిసిన ప్రయోజనమేమి? 

గు : తాను లేకపోవుటయే మర్మము, మర్మము తెలిసే. కర్మజ్ఞానములు నిర్మూలము. పిశాచం పట్టినవానికి పిశాచము విడిచి నట్టున్ను, సర్పభీతిని పొందినవానికి భయం తీరినట్టున్ను ఎరుక అనే భయము తీరితే ఏమీ లేదు. ఎరుకపోతే ఎరుకతో కూడిన యావత్తు పోవును.

శి : అట్లా ఎరుక పోయిన వెనుక ఏమి ఉండును?

గు : అత్యంత విలక్షణమై అంతర్ బహిస్సుల చలించకుండా అచలమై బట్టబయలై యున్న దేదో ఉండును.

శి : అది ఎక్కడుండును?

గు : ఆ పరిపూర్ణము ఎక్కడ ఎక్కడ ఉండునో అక్కడ అక్కడల్లా పరిపూర్ణమే, ఎరుక లేదు. ఎరుక ఉన్న చోటల్లా పరిపూర్ణమే, ఎరుక లేదు. అంటే ఎరుక ఎక్కడా లేదు. పరిపూర్ణమే అంతటా ఉన్నది. అని అర్థము. కనుక ఎరుక పుట్టనే లేదు. ఇదే సిద్ధాంతం.



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 12 | చేలివో | చేతినో |
| 5 | 18 | భా్రతి | భాతి |
| 6 | 5 | బొాకుసూ | బొారుసూ |
| 9 | 9 | ఆంతా | అంతా |
| 11 | 17 | ప్రత్యగభావము | ప్రత్యగభావము (ప్రధ్వంసాభావము) |
| 11 | 18 | వ్యాహృదా | వ్యాకృతా |
| 11 | 19 | ప్రాహృదా | ప్రాకృతా |
| 15 | 17 | చేసితే | చెప్పితే |
| 19 | 3, 4 | దనటం | లేదనటం |
| 26,27,29,31,33,35 పేజీ మొదట్లో | | అధ్యారోపోప వాదములు | అధ్యారోపాప వాదములు |
| 29 | 10 | అయిట్లుగ | అయినట్లుగ |
| 31 | 7 | ఆదే | అదే |
| ,, | 10 | తటస | తటస్థ |
| ,, | 10 | అతద్వ్యావృత్తి | అతద్వ్యావృత్తి |
| ,, | 22 | భావారహిత | భావాభావరహిత |
| 32 | 1 | అనాత్మాభాపము | అనాత్మభావము |
| ,, | 6 | వుండడు | వుండదు |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 38 | 20 | అణుపాదోదాన | అణుపాదోపాదాన |
| 39 | 16 | తోచినేలేదు | తోచనే లేదు |
| 40 | 13 | చెప్పియున్నది | చెప్పబడియున్నది |
| 40 | 21 | ఆ బద్ధమే | అబద్ధమే |
| 40 | 24 | ఆప్పుడే | అప్పుడే |
| 41 | 8 | మూలసానము | మూలస్థానము |
| 42 | 5 | లెక | లేక |
| 43 | 18 | మవాత్ప్రమాణాలలో | మహాత్ప్రమాణాలలో |
| 43 | 22 | ఎంతలో వంటే | ఎంతలో వుంటే |
| 46 | మొదట | అరవప్రకరణం | ఆరవ ప్రకరణం |
| 47 | 12 | మునకు | నకు |
| 47 | 24 | ప్రతిబింబంనకు | ప్రతిబింబమునకు |
| 53 | 12 | తద్బహ్మేతి | తద్బ్రహ్మేతి |
| 55 | 6 | నచ్చునా | వచ్చునా |
| 55 | 19 | పుట్టుంది | పుట్టింది |
| 57 | 23 | గీతావాక్యం | ఉత్తరగీతావాక్యం |
| 58 | 24 | (గు :) | (గు :) కొట్టివేయాలి |
| 59 | 22 | రెడా | రెండా |
| 61 | 13 | చితు | చిత్తు |
| 61 | 20 | జ్యోతిర్మయమె | జ్యోతిర్మయమై |
| 62 | 4 | అదే బ్రహ్మమెతె | అదే బ్రహ్మమైతే |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 5 | కానవచ్చేదతే | కానవచ్చేదైతే |
| | 15 | తూష్ణిభూతావస | తూష్ణీభూతావస్త |
| 64 | 2 | మిదంజ్ఞాన | మిదంజ్ఞానం |
| | 6 | సచ్చిదానంద్వ రూపం | సచ్చిదానంద స్వరూపం |
| | 18,20,21 | ఆస్తి | అస్తి |
| 66 | 20 | రెడోది | రెండోది |
| 67 | 14 | అనవిచ్ఛిన్న | అనవచ్ఛిన్న |
| 68 | 21 | తాచ | తాచల |
| 70 | 8 | తర్వాతము లున్న | పర్వతములున్న |
| 17 | 6 | కాలత్రమందునూ | కాలత్రయమందునూ |
| 72 | 24 | చెప్పడానికిన్న | చెప్పడానికే |
| 76 | 19 | చంచత్వము | చంచలత్వము |
| 83 | 10 | వరికృతుఅకు | పరికృతులకు |
| 85 | 24 | పురనీకి | పులికి |
| 88 | 12 | వరేకోశే | పరేకోశే |
| 90 | 20 | చిత్స్యరూపమే | చిత్స్వరూపమే |
| 94 | 19 | ఏ సానమున | ఏ స్థానమున |
| 104 | 7 | తానునుండి | తానువుండి |
| 105 | 16 | బుద్భద | బుద్బుద |
| 107 | 20 | వృక్షమండ | వృక్షముండ |
| 110 | 2 | అక్ష భ్యాసము | అక్షరాభ్యాసము |
| 110 | 11 | వృత్తమలెనవారు | వృత్తములైనవారు |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 111 | 5 | ముత్తైకువె | ముత్తైదువై |
| 112 | 8 | పార్రింబ్ధముమన్నది | ప్రారబ్ధమున్నది |
| 112 | 15 | ద్రవ్యత్వా | ద్రివత్వా |
| 118 | 13 | 6 వీనికి | 6 ఉత్పత్తి వీనికి |
| 120 | 23 | శాభవం | శాంభవం |
| 121 | 13 | ఆర్థవాదం | అర్థవాదం |
| 124 | 6 | చార్వాకాలు | చార్వాకులు |
| 129 | 7 | పుణ్యాకిక్మల | పుణ్యాకర్మల |
| 134 | 16 | చెదు | చేదు |
| 139 | 14 | అసంవాది | విసంవాది |
| | 24 | డిటో | డిటో |
| 142 | 12 | త్రిమూర్త్యాతీతనునీ | త్రిమూర్త్యాతీతునీ |
| 145 | 8 | వసువు | వస్తువు |
| 150 | 17 | చెదు | చేదు |
| 151 | 4 | అవకాశముటుంది | అవకాశముంటుంది |
| | 7 | నృతుమును | వృక్షమును |
| 153 | 14 | చెప్పవె | చెప్పనే |
| 158 | 21 | చేకూర్చ | చేర్చ |
| 159 | 14 | తలచుదామన్న | చూదామన్నా |
| 161 | 16 | ఆ శరీరాన్ని | అశరీరాన్ని |
| 163 | 7 | దాశ్రిమం | దాశ్రియం |